సరస్వతీ గ్రంథమండలి

# విశ్వకథావీథి

[నాలుగో సంపుటం]

పురిపండా అప్పలస్వామి
కవితా సమితి అధ్యక్షులు




పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కొ
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# నాలుగో సంపుటం పరిచయం

కరోలీ: హంగేరియను కథకుడు; మంచి రాజకీయ వేత్తకూడా. విశ్వసాహిత్యంలో ఉత్తమోత్తమమయిన చిన్న కథల సరసని నిలవగగిన కథ ఇతని కనపడనిపుండు. ఇంచు మించు అన్నిభాషల్లోకీ అనువాదమయిన ఈకథ వొకసారి చదివితే చాలు ఎన్నోదినాలదాకా మరపురాదు.

క్లారాఫ్రీబిగ్: సిద్ధహస్తుడయిన జర్మను కథారచయిత. 'నేను దొంగిలించలేదు' కథలో సామాన్యమయిన వొక చెప్పులుకుట్టే పరివారం చిత్రింపబడింది. ఫ్రీబిగ్ రచనలో వొక విలక్షణతా, కథ నడపడంలో వొక ప్రత్యేకతా అవు పిస్తుంది.

యోహానబూజే: నార్వేకథకుడు. నార్వేజియను సాహిత్య పరుల్లో ఇబ్సనుతరవాత చెప్పదగ్గ ప్రసిద్ధుల్లో ఇతడొకడు.

ఖం. స. దొండకర్: మన భారతీయభాషల్లో మహా రాష్ట్రభాషకూడా కథాసాహిత్యంలో ఎంతో ముందుకిపోయింది. సుప్రసిద్ధులయిన మొదటితరగతి మహారాష్ట్ర కథాశిల్పుల్లో దొండకర్ వొకరు. మోతీకథలో ఈయనచిత్రించిన బాలికా హృదయం అద్వితీయమైంది.

హెచ్. జి. వెల్సు: (Herbert George Wells) విశ్వసాహితీ యోధుల్లో మహారథి వెల్సు. నవలా, చరిత్రా,

వ్యాసమూ, చిన్నకథా—పట్టినదంతా బంగారం చేసిన ఆంగ్ల రచయిత. మేధావి. నోబులు బహుమానం అందుకున్న సుప్రసిద్ధుడు. తండ్రి జోసెపు, తల్లి నీలు. ఈయన కథాసంపుటి Tales of Wonder లోది తల. (Pollek and the Porrohman)

మున్షీ ప్రేమచంద్: మున్షీప్రేమచంద్ మొదట ఉర్దూ కథకుడు. ఈ పూటకీ ఉర్దూ కథకులికి ఈయనే గురువు. తరువాత హిందీకథక చక్రవర్తి. చివరిదినాల్లో "హిందూస్థానీ" కి వరవడిపెట్టిన మహారచయిత. ఈయని వందలాది చిన్నకథల్లో బుగతగారినుయ్యి వొకటి (ठाकुर का कुआँ)

---

## సూచిక

| కథ | పరిచయం | మూలం |
|---|---|---|
| కనపడని పుండు | — కరోలీ | — (హంగేరీ) |
| నేను దొంగిలించలేదు | — క్లారా ఫ్రీబిగ్ | — (జర్మనీ) |
| ఇవానా | — యోహానబూజే | — (నార్వే) |
| మోతీ | — ఖ. స. దాండకర్ | —(మహారాష్ట్రం) |
| తల | — హెచ్. జి. వెల్సు | — (ఇంగ్లీషు) |
| బుగతగారినుయ్యి | — మున్షీప్రేమచంద్ | —(హిందూస్థానీ) |

---

ఐదో సంపుటంలో

స్పెయిను, స్వీడను. గుజరాతీ, జెకోస్లావియా, ఫ్రెంచి, యుగోస్లావియా కథలు చక్కనివి వున్నాయి.

# కనపడని పుండు

ఉదయాన్నే డాక్టరుగారింకా పక్కమీంచి లేవలేదు, నౌకరు వచ్చి చెప్పాడు "బాబూ, ఎవరో వచ్చారండి. తక్షణం మిమ్మల్ని చూడాలంటున్నారండి" అని. డాక్టరు తొందరగా బట్టలు వేసుకున్నాడు; డిస్పెన్సరీగదిలోకి వచ్చి, రోగిని తీసుకురమ్మన్నాడు.

రోగి ఘరానావ్యక్తిలా కనిపిస్తున్నాడు. అతడు తీవ్రమయిన బాధ అనుభవిస్తున్నాడని బాగా పాలిపోయిన అతడి మొహం స్పష్టంగా చెపుతోంది. కుడిచేతిని గుడ్డతో కట్టాడతడు. బాధ సయించుకునేందుకు ఎంత ప్రయత్నిస్తున్నా మధ్యమధ్య మూలుగుతూనే వున్నాడు.

డా: కూచోండి. ఏమిటి బాధ?

రో: వారం దినాలయిందండి. కంటిమీద కునుకులేకండా వుంది. కుడిచేతిమీద చాలా బాధగా వుంది. ఏమయిందో ఏమీ తెలియకండా వుంది. రాచకురుపో ఏమో? కాకపోతే ఏదో ప్రమాదకరమయిన వ్యాధి అయి వుండాలి. మొదట్లో నేను లక్ష్యపెట్టలేదు. కాని, తరవాత బాధ జాస్తీ అయిపోయింది. దుర్భరంగా వుంది. ఒక్కక్షణం నెమ్మదిగా కూచోలేక పోతున్నాను. ఒక గంటసేపిలాగేవుంటే పిచ్చెత్తిపోతాను. అందుకనే మీదగ్గిరికి పరిగెత్తుకు వచ్చాను. వెంటనే ఆపరేషను చేసెయ్యండి.

డాక్టరు రోగికి ధైర్యం చెప్పాడు.

"భయపడకండి. బహుశా ఆపరేషను అవసరమే కాక పోవచ్చు"

"అబ్బే, అల్లకాదు. ఆపరేషను చేసి తీరాలి. ఆపరేషను కోసమే మీదగ్గిరికి వచ్చాను. ఆపరేషను చెయ్యకపోతే బాధ నయంకాదు."

కష్టంమీద కట్టువిప్పి మళ్ళీ అన్నాడు "డాక్టరుగారూ ముందే మీతో చెపుతున్నాను. పుండుగానీ, వాపుగానీ ఏమీ కనిపించదు. ఇలాంటి రోగం బహుశా మీరు చూసే వుండరేమో!"

"కొత్తజబ్బు చూసి ఆశ్చర్యపోయే అలవాటు నాకు ఎప్పుడూ లేదు" అన్నాడు డాక్టరు.

కాని, పరీక్షచేసి చూసినతరవాత నిజంగా ఆశ్చర్య పోయాడు డాక్టరు. తనచేతిలోంచి రోగిచెయ్యి జారిపోయింది.

"ఏమిటిది? రోగం గుర్తన్నా కనిపించదే! కురుపుకాదు కదా చిన్న పొక్కన్నా, వాపన్నా అవుపించదే!!"

జారిపోయిన చెయ్యి ఎడంచేత్తో పట్టుకుంటూ చాలా బాధపడ్డాడు రోగి.

"ఎక్కడ బాధ?" అని మళ్ళీ అడిగాడు డాక్టరు.

రెండు నరాలమధ్య చేతినిచూపాడు రోగి. అతడుచూపిన చోట వేళ్ళతో మెల్లగా నిమురుతూ అడిగాడు డాక్టరు

"ఇక్కడా ?"

"ఆఁ! ప్రాణం పోతున్నాది."

"తాకినచోట బాగా నొప్పిగావుందా ?"

రోగి జవాబు చెప్పలేదు. అతడి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"ఆశ్చర్యం! రోగమేమిటో అర్థం కావడం లేదు."

"నాకూ అర్థంకాలేదు. కాని, బాధ భరించలేక పోతున్నాను. ఇంతకంటె చావు నయం."

డాక్టరు మళ్ళీ బాగా పరీక్ష చేశాడు. చివరికి తలవూపేసి పెదవి విరిచాడు. "చిన్నమచ్చయినా కనిపించదు. నాడిలో సహా ఏలోపమూ లేదు. చేతిమీద వాపయినా లేదు ఏమిటీ రోగం ?"

"చూడండీ, — ఇదిగో, ఇక్కడ కత్తిలా ఎర్రగా —"

"ఎక్కడ"

"ఇక్కడ" అంటూ చేతిమీద వొకచోట చూపించాడు రోగి. అతడి మొహం తేరిపారచూశాడు డాక్టరు. అతడు పిచ్చివాడేమో అని అతడికి సందేహం కలిగింది.

"మీరు కొన్నాళ్ళు పట్నంలో వుండవలిసి వుంటుంది. మీరోగం నయంకావడానికి ప్రయత్నిస్తాను."

"ఒక్కక్షణం ఆగలేను. మీరు నన్ను పిచ్చివాడను కుంటున్నారేమో! పొరపాటు. ఈ కనపడని పుండు నన్ను బతకనివ్వడంలేదు. అందుకే చెప్తున్నాను, ఇక్కడ ఆపరేషను చెయ్యండి."

"లేదు బాబూ, ఈపని నాచేత కాదు."

"ఏం?"

"ఏమంటే, మీ చేతిమీద ఏమీ లేదు. నాచెయ్యి మాదిరిగానే ఆరోగ్యంగా వుంది."

"మీరు నన్ను పిచ్చివా డనుకుంటున్నారు. లేదా, మీ దగ్గిర నేను నటనచేస్తున్నా ననుకుంటున్నారు" అంటూ జేబులోంచి వందరూపాయల నోటు తీసి బల్లమీద పెట్టాడు రోగి. "చూడండీ, డాక్టరుగారూ. నేను నటించడంలేదు. నా మాట నమ్మండి. బాధ దారుణంగా వుంది. వెయ్యిరూపాయ లయినా ఖర్చు పెట్టడానికి సిద్ధంగా వున్నాను. దయచేసి ఆపరేషను మొదలు పెట్టండి."

"వెయ్యికాదు, లక్షరూపాయలిచ్చినా అకారణంగా ఆపరేషను చెయ్యడానికి సాహసించలేను."

"ఎంచేత?"

"ఎంచేత ఏమిటి! నన్ను మూర్ఖుడికింద జమకడుతుంది. లోకం. నిందలపాలయిపోతాను నేను."

"అయితే పోనీ మరోపని చెయ్యండి. నేనే స్వయంగా కోసేసుకుంటాను. ఎడమచేత్తో సరిగ్గా కోయలేనేమో! అంచేత మీరు కొంచెం సరిచేసి, కట్టు కట్టిపెట్టండి" అంటూ రోగి తన జేబులోంచి చప్పున చాకు తీశాడు. డాక్టరు అడ్డు కోకముందే చేతిని జోరుగా కోసుకున్నాడు.

"ఆగండి, ఆగండి. ఏమిటిది?" అంటూ డాక్టరు కేక వేశాడు. చేతి నరాలు తెగిపోతాయేమో అని అతడి భయం. "కోయడం తప్పనిసరే అయితే ఆకోయడ మేదో నేనే కోస్తాను. ఇలా ఇవ్వండి" అన్నా డతను.

ఆపరేషను చేసినప్పుడు రోగిని "మొహం పక్కకి తిప్పు కోండి" అన్నాడు డాక్టరు. నెత్తురు తన కళ్ళపడితే భయం కలగడం సహజమని అతడి అభిప్రాయం.

"అవసరం లేదండీ, కానీయండీ" అన్నాడు రోగి. కదల కండా కూచున్నా డతడు. ఏమాత్రమూ చలించలేదు. ఆప రేషను పూర్తయ్యాక తేలికయిన నిట్టూర్పు విడిచాడు. పెద్ద బరువు నెత్తిమీంచి దించివేసినట్టయిం దతడికి.

"ఇప్పుడు ఎలావుంది బాధ?" అని అడిగాడు డాక్టరు.

"నెమ్మదిగావుంది. బాధని కోసి పారేసినట్టు హాయిగా వుంది. బాగా వుక్కపోసిన తరవాత చల్లగాలి తగిలితే ఎలావుంటుందో అలావుంది" — నవ్వుతూ అన్నాడు రోగి. గాయానికి కట్టు కట్టాక ఉత్సాహంగా కనిపించా డతను. మొహం కలకలలాడింది. వెళ్ళిపోతూ డాక్టరు చేతులు పట్టు కుని "మీ ఉపకారం ఎన్నడూ మరిచిపోను." అంటూ నమ స్కారం చేశాడు.

తరవాత డాక్టరు రోగిని అతడు బసచేసినహోటల్లో చూస్తూవచ్చాడు. రోగి మంచి ఘరానా కుటుంబంవాడూ, విద్యావంతుడున్నూ కావడంచేత డాక్టరుకి అతడిమీద గౌరవం

అభిమానం హెచ్చుతూ వచ్చాయి. గాయం నయంకాగానే రోగి తన స్వగ్రామం వెళ్ళిపోయాడు.

మూడు వారాలు గడిచాయి. అతడు మళ్ళీ డాక్టరు దగ్గిరికి వచ్చాడు. మొదటిలాగే చేతికి గుడ్డకట్టు కట్టాడు. మొదటిలాగే భరించలేనంత బాధపడుతున్నాడు. మూలుగుతూ డాక్టరుతో చెప్పాడు.

"సరిగా ఆదేచోట బ్రహ్మాండమైనంత బాధగావుంది"

అతడి మొహంలో చిక్కితే రక్తంలేదు. తల తలంతా చెమట్లు పోస్తున్నాయి.

"మళ్ళీ ఏమయింది?" అంటూ అడిగాడు డాక్టరు.

"మీరు లోతుగా కొయ్యలేదు. మొదటికంటే బాధ అధికమయింది. నాచావు దగ్గిరపడిందో ఏమో! దయచేసి మళ్ళీ బాగా ఆపరేషను చెయ్యండి"

ప్రతీమాటా కష్టంగా అంటున్నాడు రోగి. మళ్ళీ బాగా పరీక్ష చేశాడు డాక్టరు. లోగడ ఆపరేషనుచేసిన గాయం సీదాగా మానిపోయింది. నాడిలోకూడా ఏదోషమూ కనిపించలేదు. జ్వరమూలేదు. అయినా రోగి వణుకుతున్నాడు.

"ఇలాంటి జబ్బు నేను ఎన్నడూ చూడలేదు సరికదా విననైనాలేదు!" అన్నాడు డాక్టరు.

మళ్ళీ ఆపరేషను జరిగింది. మొదటిలాగే ఇప్పుడూ రోగి బాధ తగ్గిపోయింది. రోగికి నెమ్మది కలిగింది. అయినా

అతడి మొహంలో నవ్వు కనిపించలేదు. విచారంగానే డాక్టరుదగ్గర సెలవుతీసుకున్నాడు.

"బతికేవుంటే — మళ్ళీ నెలలోపునే వస్తానేమో, మీరు ఆశ్చర్యపడకండి."

"ఎందు కలా అధైర్యపడతారూ!"

"నాకు తెలుసు; అంచేత — సరే, నమస్కారం"

డాక్టరు తన స్నేహితుల్తో ఈ వింతసంగతి చెప్పాడు. ప్రతీ వాడూ ఏదో అభిప్రాయం వెళ్ళబుచ్చాడు. కాని, ఎవరూ తృప్తికరమైన సమాధానం చెప్పలేకపోయారు.

ఒకనెల గడిచిపోయింది. రోగి రాలేదు. మరికొన్నిదినాలు గడిచిపోయాయి. ఒకనాడు రోగికి బదులు అతడి దగ్గరనుండి వొక ఉత్తరంవచ్చింది. రోగి పూర్తిగా ఆరోగ్యం పొంది వుంటాడన్న ఆనందంతో డాక్టరు ఉత్తరం విప్పాడు.

ఉత్తరం ఇలా వుంది:

"డాక్టరుగారూ,

నా రోగం మూలకారణం విషయంలో మిమ్మల్ని సందేహంలో వుంచదలచుకోలేదు. నా రోగం దారుణమైంది. దాని చరిత్ర మీకు నివేదిస్తున్నాను. బాధ రెండింతలు, మూడింతలు పెరిగిపోయింది. కాల్తూవున్న నిప్పులు చేతిమీద పెట్టుకుని మీకు ఈఉత్తరం రాస్తున్నాను.

ఆరుమాసాల క్రితం నాఅంత అదృష్టవంతుడు ఎవడూ లేడు. సంపత్తికేమీ లోపంలేదు. కావలిసిన వస్నీ

వున్నాయి. ముప్ఫయి సంవత్సరాల యువకుడికి ఆనందం కలిగించడానికి ఏవేవి కావాలో అవన్నీ నాకు వున్నాయి. సంవత్సరం కిందట పెళ్ళిచేసుకున్నాను. నాభార్య చాలా అందమైన అమ్మాయి, బాగా చదువుకుంది. ఉత్తమురాలు. శేరాణిలాంటి నిర్మలమైన పిల్ల. మా దేశం రాణీగారికీ ఆమెకీ స్నేహం.

నాభార్య నన్ను మనసారా ప్రేమించింది. ఆమె ప్రేమే నాజీవనంగా వుండేది నాకు. ఆరునెల్లూ మహానందంగా గడిచాయి. ఆసౌఖ్యం ఎలాచెప్పేది? ప్రతీదినమూ, గతించిన దినంకంటే బావుండేది, నేను బైటికివెళ్తే, వచ్చేవరకూ ఆమె నాకోసం కిటికీదగ్గిర నుంచుని వుండేది. నేను కళ్ళబడగానే గులాబీపువ్వులాగ కిలకల లాడిపోయేది. ఉషస్సులాగ ఆమె నిర్మలంగా వుండేది. పసిపిల్లలాగ అమాయకంగా సరళంగా వుండేది.

ఎంచేతో తెలీదు, కొన్నాళ్ళయాక అదంతా నటన అని నాకు అనుమానం మొదలైంది. మనిషి తన మహానందం లోంచే మూర్ఖుడై దుఃఖాన్ని పైకి తీస్తాడు.

నాభార్య దగ్గిర వొక చిన్న టేబిలు వుండేది. దాని సొరుగు తాళాలు ఎప్పుడూ ఆమె వేసేసి వుంచేది. అది నాకు చాలా కష్టంగా వుండేది. తాళపు చెవులు తనదగ్గిరే భద్రంగా వుంచుకునే దామె. పొరపాట్నయినా మరిచిపోయేదికాదు. ఇంత జాగ్రత్తగా నాదగ్గిర దాచుకునే వస్తువ

ఏమిటయి వుంటుంది? ఈ సందేహం నన్ను పట్టుకుంది. సందేహం నన్ను పూర్తిగా పిచ్చివాణ్ణి చేసేసింది. ఆమె సరళమయిన కన్నులమీదా, గభీరమయిన ప్రేమమీదా నాకు సందేహం పెరిగిపోయింది. అవును ఇదంతా నటన! మోసం!!

ఒకనాడు రాణి మా ఇంటికి వచ్చింది. తనతో సుఖంగా కాలక్షేపం చెయ్యడంకోసం నా భార్యని కోటలోకి ఆహ్వానించింది. నన్ను కూడా రమ్మని బలవంతపెట్టింది. నేనుమాత్రం వెళ్ళలేదు. సాయంకాలం వస్తానని చెప్పి వుండిపోయాను. నాభార్య రాణితో వెళ్ళింది.

వాళ్ళబండి మా గేటు దాటగానే నేను ఇంట్లోకి వచ్చేశాను. నాభార్య టేబిలు తెరవడానికి ప్రయత్నం చేశాను. చాలా కష్టంమీద చివరికి సొరుగు తెరిచాను. ఆడవాళ్ళు వాడుకునే వస్తువుల్తో నిండివుంది సొరుగు. వాటన్నిటినీ తొలిగించి చూశాను. వాటిల్లో పట్టురుమాలుతో కట్టిన ఉత్తరాలకట్ట వొకటి దొరికింది. చూడ్డంతోనే అవి ప్రణయ లేఖలని తెలిసిపోతుంది. అవన్నీ గులాబీరంగు రిబ్బనుతో అందంగా కట్టివున్నాయి.

ఆడవాళ్ళ చిన్నప్పటి వస్తువులు పరికించకూడదన్న సంగతి నేను భావించనేలేదు. మా పెళ్ళితరవాతనే ఈ ఉత్తరాలు వచ్చి వుంటాయనే నానిశ్చయం. ఆనిశ్చయంతోనే రిబ్బను విప్పాను; వొక్కొక్కటే చదవడం మొదలుపెట్టాను. భర్తని మోసం చేస్తూ, — నమకద్రోహం చేస్తూ — ఘోరంగా వున్నాయి

ఉత్తరాలు. అన్నీ ఒకదాన్నిమించి ఒకటి వున్నాయి. రాసినవాడు నాస్నేహితుడే. ప్రేమా, పరస్పరసంబంధం ప్రతీ పంక్తిలోనూ కనిపిస్తోంది. ఉత్తరాలన్నీ మాపెళ్ళి తరవాత రాసినవే.

నాగుండెల్లో రేగిన తుపాను వర్ణించలేను. చదివేశాక ఉత్తరాలన్నీ కట్టకట్టేశాను. సొరుగులో యథాస్థానంలో పెట్టేశాను. ఎప్పటిలాగే తాళంవేసేశాను.

నాకు తెలుసు, నేను వెళ్ళకపోతే సాయంకాలం నాభార్య ఇంటికి వచ్చేస్తుంది. అలాగే జరిగింది. ఉత్సాహంగా ఆమె బండిదిగింది; నాదగ్గిరికి పరిగెత్తుకుంటూ వచ్చింది. నేనూ ఏమీ ఎరగనట్టే నటించాను. కొంచేపు మాటమంతీ ఆడుకున్నాము. భోజనాలయ్యాక పడకగది చేరాము. నాభార్య పక్కమీద వాలడంతోటే నిద్రపోయింది. నాకుమాత్రం నిద్రరాలేదు. ఎలా వస్తుంది? నాలో ఒక భయంకరమైన తుపాను రేగుతూవుంది. మహాభయంకరమైన తుపాను లేస్తూవుంది.

రాత్రి గంభీరంగా వుంది. అంతటా నిశ్శబ్దం. నాగుండెల చప్పుడుతప్ప ఏమీ వినబడడంలేదు. లేచి కూచున్నాను. ఆమెని చంపెయ్యాలి. చంపెయ్యాలన్న కాంక్ష నానెత్తికెక్కి కూచుంది. లేచాను. కుడిచెయ్యి, ఆమె పీకమీద వేశాను. నాబలమంతా ఒక్క సారి ఉపయోగించి, దబాయించి

నొక్కాను. ఒక్కసారి, అవును ఒక్కసారే, ఆమె కళ్ళు విప్పింది. తెల్లబోతూ నా మొహం చూసింది.

తరవాత, మెల్లిమెల్లిగా ఆ కళ్ళు మూసుకు పోయాయి. శాశ్వతంగా అవి మూసుకుపోయాయి.

"తప్పించుకోవడం కోసం ప్రయత్నించలే దామె. తనని తాను రక్షించుకోవాలని పెనగులాడలేదు ఆమె నోటినించి పెదవులమీంచి ఒక రక్తం చుక్క పైకి వచ్చింది; నాచేతి మీద పడింది. రక్తం పడ్డచోటు మీకు తెలుసు.

"నా భార్య అంత్యక్రియలు నిరాడంబరంగా ముగించాను. ఆమె ఎలా చనిపోయిందని ఎవ్వరూ అడగలేదు. హత్య అని ఎవ్వరూ అనుమానపడలేదు. ఏమంటే ఆమె నాభార్య కనక. బంధువులు కానీ, దగ్గిర చుట్టాలు కానీ ఆమెకి లేరు అంచేత ఎవరికీ చెప్పవలిసిన అగత్యమూ లేకపోయింది.

"నామట్టుకు నాకు ఏమీ దుఃఖం కలగలేదు. నిజమే, నేను క్రూరమయినపనే చేశాను. అయితే, అది ఆమెకి తగినపనే.

"స్మశానం నించి తిరిగి వచ్చాక చూశాను, రాణి మా యింటికి వచ్చి వుంది. ఆమె చెప్పరానంత దుఃఖంతో వుంది. హఠాత్తుగా నాభార్య చచ్చిపోయిందన్న వార్త ఆమెని చకితు రాలిని చేసివేసింది. నన్ను ఓదార్చడం కోసం ఆమె ఎన్నో మాటలు చెప్పింది. నేనుమాత్రం ఆమెమాటలు చెవిని పట్టించుకోలేదు. ఏమంటారా, నాకు ఓదార్పు అవసరమే

లేదు. కొంతసేపయాక, ఎంతో పరిచయంగా నాచెయ్యిపట్టు కుంది రాణీ.

"మీతో వొక రహస్యం చెప్పవలిసి వుంది" అంది. "నేను మీభార్యదగ్గిర వొక ఉత్తరాల కట్ట దాచాను. అవి రహస్యమైనవి. అందు కని అవి మాఇంట్లో వుంచడం జతపడ లేదు. దయచేసి ఆ ఉత్తరాలు నాకు ఇచ్చెయ్యాలి" అంది.

"ఏమిటా ఉత్తరాలు?" అని అడిగాను. రాణీ కొంచెం కోపం తెచ్చుకుంది.

"మీభార్య చాలా ఉత్తమురాలు. ఆమె ఎప్పుడూ ఇలాగ అమర్యాదగా 'ఏమిటా ఉత్తరాలు' అని అడిగిన పాపాన పోలేదు. వాటిని తాను చూడనని కూడా మాట ఇచ్చింది." అంది.

"నేను సిగ్గుపడ్డాను. మీఉత్తరాలు ఎక్కడ వున్నాయి?" అనికూడా అడిగాను.

"తన టేబిలు సొరుగులో వుంచానని చెప్పింది. గులాబీ రంగు రిబ్బనుతో కట్టివుంటాయి, పట్టుగుడ్డలో. చూడగానే పోల్చుకుంటాను. అన్నీ మూడువందల ఉత్తరాలు."

"టేబిలు వున్న గదిలోకి ఆమెని తీసుకువెళ్ళాను. సొరుగు తీసి ఉత్తరాలకట్ట ఇచ్చేశాను. భయంతో మొహం మీది కెత్తలేదు నేను. నాకళ్ళు చూసి రాణీ అంతా పసికట్టె య్యదు కదా!"

"ఆమెని చంపిననాటి రాత్రి రక్తంపడ్డచోట, వారందినాల తరవాత తేలుకుట్టినట్టు సలుపు మొదలైంది. అనంతరం జరిగిన దంతా మీకు తెలుసు. ఆలోచించకండా — కనికరం లేకండా — ఏపాపమూ ఎరగని నిర్దోషురాలిని పీకనొక్కి దారుణంగా చంపిన నాకు ఈశిక్ష కావలిసిందే. ఇక దీన్ని బాగు చేయించుకోవడానికి ప్రయత్నించను. త్వరగా ఆమె దగ్గిరకే వెళ్ళిపోతాను. ఆమెకే క్షమాపణ చెప్పుకుంటాను. ఆమె నన్ను క్షమిస్తుంది. ఎప్పటిలాగే నన్ను ప్రేమిస్తుంది.

"డాక్టరుగారూ, వెళ్ళుతున్నాను. సెలవు."

# "నేను దొంగిలించలేదు"

చాలా ఇరుకుగా వుంటుంది ఆదొడ్డి. ఎప్పుడూ చీకటి గానూ వుంటుంది. తల ఎత్తిచూస్తే, మీద ఆకాశం చిన్న ముక్కలా కనిపిస్తుంది. అదీ చిమినీల పొగతో మసకమస కగా వుంటుంది. కింద చెమ్మగావుంటుంది. జోళ్ళుకుట్టే వాళ్ళు పోసేనీళ్ళవల్ల ఎప్పుడూ దుర్గంధంగానూ వుంటుంది. ఇటూ అటూ ఎత్తయిన మేడలు వేసవి దినాల్లో మాత్రం-అదీ మట్టమధ్యాహ్నంవేళ అతికష్టంమీద సూర్యకిరణాల వెలుగు దారి సగం వరకూ పడుతుంది. కిందిఅంతస్థుల గదు ల్లో ఎప్పుడూ చీకటిగానే వుంటుంది. చెమ్మతో చల్లగా వుండే నాలుగయిదు మెట్లు ఎలాగో తడువుకుంటూ దిగి వెలితే ఎదురుగ్గా చిన్నద్వారం వున్న ఇల్లు కనిపిస్తుంది. అక్కడ బాగా తేరిపారచూస్తే, ఆ ఇరుకు ద్వారం పక్క గోడమీద చిన్న చిరిగిపోయిన అట్టముక్క అవుపిస్తుంది. అదిచిన్నచిన్న నాట్లువేసి గోడకి కొట్టివుంటుంది. దానిమీద "స్టీబకే: జోళ్ళు తయారుచేసేవాడు" అని రాసి వుంటుంది.

మధ్యాహ్నమయింది. ఆదొడ్డిలో కాపురం వున్న దుర దృష్టవంతులు అప్పుడే తిఫ్ఫీ అవీ ముగించుకుని తీరికగా వున్నారు. రెండు అంతస్థుల్లోనూ అన్ని కిటికీలూ తీసి వున్నాయి. కంచాలూ, ప్లేట్లూ గలగల మనడం వినిపిస్తూ

వుంది. పిల్లాజెల్లా కుంయ్యో, కంయ్యో మంటున్నారు. సాల్ గమ్, వుల్లీ, వెల్లుల్లీ — వీట్లవాసన గుప్పుమంటూ వుంది.

ఒకామె పెద్దగొంతుకతో ఏదో వీధిపాట మొదపెట్టింది. ఎండాకాలం, ప్రేమా, కులాసా — వీటిగురించే వుంది ఆపాట. మాంచి వుపారుస్థాయిలో ఆమె వొదిలిపెట్టింది కంఠం. దాని మీద పిల్లలగోలా, కంచాలు కిందపడిపోయిన ధ్వనీ అన్నీ కలిసి తారకం అందుకున్నాయి.

దొడ్డి అవతలవరసనించి పెద్ద బొంగురుగొంతుకతో ఎవరో అరిచారు.

“కొంచెం నోరు కట్టిపెట్టవమ్మా, ఓఅరుస్తున్న అమ్మా? నీలాగే అందరూ అరిస్తే ఇక్కడ వుండడమే గోల అయి పోతుంది.”

ఒకకిటికీ దభీమని మూతపడింది. కిటికీతోపాటు పాటా బం దయిపోయింది.

నిశ్శబ్దంగా వుంది. గోడలమీద సగంసగం మాత్రం సూర్య కిరణాలు పడుతున్నాయి. అవి మెల్లిమెల్లిగా పాకుతున్నాయి. అంతలోనే, భయపడుతున్నాయా అన్నట్టు వెనక్కి తగ్గుతు న్నాయి. బైట గోడ్లమీద, రాళ్ళుపగుల్తున్నట్టువుంది ఎండ. వేసవి నడియవ్వనంలో వుంది. ఇతరచోట్ల పచ్చని చెట్లు ఈల లూపుతున్నాయి. కాని, ఇక్కడమాత్రం పచ్చని గడ్డి పరకన్నా కనపడదు. వడగాడ్పు మొహాం మాడ్చేస్తూ వుంది;

చెమటలు పోసేస్తూ వుంది; వీపుమీదమాత్రం చల్లగా వున్న ట్లనిపించి వెళ్ళిపోతూవుంది.

దొడ్డిలోనివాళ్ళు మధ్యాహ్నభోజనా లయ్యాక, చిన్న కునుకు తీస్తున్నారు. గంటా, గంటన్నర కునుకు తియ్యడానికి వాళ్ళకి ఇదే సమయం. కాని, ఆగండి! ఒక కిటికీ తెరుచు కుంది. ఏదో దొడ్డిముందు వచ్చిపడింది. దుమ్ముముక్క-ఎండవెలుగులో అది మెరుస్తోంది!

అదిగో, ఆమూలవొక ముసలికుక్క కూచునివుంది. బాగా బక్క-చిక్కి-పోయి వుం దది. దుమ్ము చూడగానే దానికళ్ళు మెరిశాయి. మెల్లిమెల్లిగా ఆకళ్ళమెరుపు మరింత అధిక మయింది. ఒకకాలు మెల్లిగాచాచింది కుక్క-. మెల్లిమెల్లిగా మరోకాలూ చాచింది. లేచిం దది. ముందుకి వచ్చింది. ఆకలితో అలిసిపోయిన దానిశరీరం వూగుతోంది. అరుగు చివరిదాకా ఎలాగో ఈడ్చుకుంటూ వచ్చింది. మెడ చాచింది. నాలిక పైకితీసింది. ఉహూం, లాభం లేకపోయింది. దాని మెడకి కట్టినగొలుసు పొట్టిగా వుంది. దుమ్ముముక్క-దాకా అంది రాలేదది.

బాధతో గుర్రుమని మూలిగింది కుక్క-. కాళ్ళుచాచడం, ముందుకి బకరడం మానేసింది. ఉన్నదగ్గిరే తిన్నగా పడుకుని పోయింది. మట్టిరంగుగావున్న దానితల దానిపాదాలమీదే వుంది. కళ్ళు అరమూతలుగా వున్నాయి. అయినా ఇటూ అటూ అదోలా చూస్తూనూ వుందది. దానివెంట్రుకలమీద

ఈగలు ముసురుతున్నాయి. జిడ్డుగా కారుతూవున్న దాని కన్నీళ్ళమీద వాలుతున్నాయి.

దిగజారుతున్న మూలుగుతో సగం లేచింది కుక్క. తోకతో అందినంతమట్టుకు వెనకభాగం ఈగలు రొప్పింది.

దుమ్ము – పెద్దదుమ్ము. రాళ్ళుపేర్చిన దొడ్డిలో పడివుంది. దానిమీదికి ఈగలు వెళ్ళడం మొదలు పెట్టాయి. కాంతి సూచిస్తూవున్న కుక్కకళ్ళల్లో మరోసారి బాధతో కూడిన వాక తళుకు మెరిసింది. ఆఖరిసారి మళ్ళీ అటు చూసింది. పక్కనేవున్న చిప్పలో మూతిపెట్టింది. చిప్పలో నీళ్ళులేవు. కాళీగానే వుందది. ఒక్కచుక్కయినా తడిలేదు.

నాలికపైకిచాచి మళ్ళీపడుకుంది కుక్క. ఒకమారు కుడి తట్టూ, మరోమారు ఎడమతట్టూ చూసింది. అంతే. తర వాత నిద్రపోయినట్టుంది.

కాదు, చూడండి! దొడ్డిద్వారం చప్పుడైంది. రెండు చిన్నచేతులు కుక్కని కౌగిలించుకున్నాయి. ఒక కుర్రాడు దానిదగ్గిర నేలమీద చతికిలబడ్డాడు.

"ప్లూటో, ప్లూటో నాముసిలిప్లూటో!" ఆపిలుపులో ప్రేమ వొలికిపోతూవుంది. తోక ఆడించింది కుక్క. కుర్రాడి బక్కగుండెలమీద మోర మోపింది. అతడి చేతులూ, మొహమూ నాకింది. అయితే దాని ఆనందంలో ఉత్సాహం లేదు; వేదన కనపిస్తూనేవుంది. గ్రహించాడతడు.

"అయ్యో, ఫ్లూటో, నీదగ్గిర నీళ్ళు లేవా! ఉండు" అంటూ లేచాడతడు. విరిగిన మట్టిచిప్పతో పైపు దగ్గిర నించి నీళ్ళు తెచ్చాడు. కుక్కచూపు కనిపెట్టి, దుమ్ముమ్ముక్కా తెచ్చి వేశాడు. పెద్దపెద్ద కోరలతో దాన్ని కొరకడం మొదలెట్టింది కుక్క. చూస్తూ నుంచున్నాడు కుర్రాడు. నిరాశతో కూడిన చిన్న నవ్వు నవ్వాడతడు. ఉత్తచేతులు కుక్కకి చూపించాడు.

"నాదగ్గిర ఏమీలేదు. చూడు, ఏమీలేదు. కాని, వుండు కొంచెం వోపికపట్టు ఫ్లూటో, నాచేతికి కొంచెం డబ్బురానీ. నువ్వు ఆశ్చర్యపోతావు. నిజం. నీకు బలే మాంసం ముక్క తెచ్చి పెడతాను. కసాయి దుకాణంమీద ఎదురుగ్గా వేలాడుతుందే చట్ట — దాన్లోంచి మాంచి ముక్క తెచ్చిపెడతాను ఫ్లూటో, నిజం. నామాటనమ్ము" అన్నాడతడు.

చెప్పడం తెలికే హాఁస్ స్టిబకేకి. తనచేతిలో దమ్మిడీలేదు. కసాయిదుకాణం మీంచి పెద్ద మాంసం ముక్క తేవాలంటే అన్ని డబ్బులు అతడికి ఎక్కణ్ణుంచి వస్తాయి? తన దగ్గిరవుండే దల్లా తన రొట్టిలోంచి మిగిల్చిన నాను రొట్టిముక్క మాత్రమే. అదే తననేస్తానికి పొద్దుటా, సాయంకాలం తాను ఇవ్వగలిగింది. అప్పుడప్పుడు చిన్న దుమ్ముముక్కా, తన హృదయంలోని ప్రేమమాత్రం అతడిచ్చేవి.

హాఁస్ స్టిబకే కుర్రాడు. పట్నం ఉత్తరభాగంలో పాలు అమ్మడం అతడిపని. చందమామ మనకవెన్నెల చల్లుతూ

వున్నప్పుడు, తరుచు హాక్స్ చిన్న దేహం — ఎండి బక్క-చిక్కివున్న ఆ దేహం అద్రుడ్డిలోంచి బయలు దేరుతుంది. నిశ్శబ్దంగానూ నిర్మానుష్యంగానూ వుంటాయి వీధులు. వాటిలోంచి చప్పుడు చేసుకుంటూ కదిలిపోతూ వుంటా డతడు. చేతులికి గ్లౌజులూ, మెడకి నెక్టయీ వేసుకున్నా కూడా చలిరోజుల్లో గాలి శరీరంమీదికి ప్రవేశిస్తూనే వుంటుంది, వస్త్రాల్లోంచి. ఎండాకాలంలో మిట్టమధ్యాహ్నా మప్పుడు, అలిసిపోయిన దోమలాగ వచ్చి ఇంట్లో దూరతా డతడు. అతడి పెరగడం ఆగిపోయింది. అతడి జబ్బుకళ్ళూ, చప్పిడిముక్కూ, వాడిపోయిన చూపులూ చూసినవాడు ఎవడూ అతడికి పన్నెండేళ్ళే అయాయని అనుకోడు. అతడికనుబొమల కిందిభాగం మాడిపోవడం మొదలెట్టింది. మెడకింద ఎముకలు పొడుచుకుని ముందుకి వచ్చేస్తున్నాయి.

ఫ్లూటోని తట్టాడు హాక్స్. కిందామీదా వున్న చీడీల మీంచి టకటకా నడుస్తూ కింది ఇంటిదిక్కు నడిచా డతడు. అతడు ఇంటిదిక్కు వెళుతూవుంటే అతడిలో కళ మాయమైపోతూవున్నట్టు కనిపిస్తున్నాయి ఆతడివేళ్ళు. ఒక ఇంటి గుమ్మంముందు నుంచున్నా డతడు. తన తలమీంచి టోపీ తీసేశాడు. బంగారం రంగులోవుంది పీచుజుత్తు. మీదికి — ఆకాశందిక్కు చూశాడు. చుట్టూ మేడలవల్ల చిన్న ముక్కలా అవుపిస్తూ వుంది. ఆకాశం. అతడి కళ్ళలో వైరాగ్యం, జబ్బూ కనిపిస్తోంది. వర్షంకురిస్తేనేం — ఎండలు

మండిపోతేనేం—అతడికేముంది; వచ్చేదీలేదూ, పోయేదీ లేదు. అంత ఉదాసీనంగా వున్నా డతడు.

మెల్లిమెల్లిగా ముందుకి అడుగులు వేశాడు. మెట్లమీంచి కిందికి దిగాడు. అదిగో అక్కడే ద్వారందగ్గిర అట్టమీద రాసివుంది.

" స్టీబకే : జోళ్ళు తయారుచేసేవాడు. "

లోపల ఏదో చప్పు డయింది. వెంటనే ఎవరో ఆవులించి నట్టూ వినిపించింది. కుర్రాడి మొహంలో భయం కనపడింది. అతడితండ్రి ఇంట్లోవున్నా డు. ఆలోచిస్తూ నిలబడిపోయాడు. హాంస్. చివరికి ఎలాఅయితేనేం జంకుతూ జంకుతూ జాగ్ర త్తగా తలుపుతోశాడు.

" ఓహో, దొరగారా ? తుదకి ఇప్పుడు దయచేశా రన్న మాట ! వేళ కాళ్లమీద వుంటుంది తమకి ! ఇంతదాకా ఎక్కడ మైన్లు వెలిగిస్తున్నా వేమిటి ? చచ్చు వెధవా ! ఆఁ, బావుంది. సువ్వూ సరైనవేళకే వచ్చావు. చప్పున పరిగె త్తుకు వెళ్ళు. కుతేకు దుకాణం నించి మూడణాల సారా పట్టు కురా. అదిగో సీసా అక్కడే వుంది. ఏం ! డబ్బులు రేపు ఇస్తానని చెప్పు. తెలిసిందా ? పరిగెత్తు ఇక్కడ వున్నట్టు రావాలి . "

కుర్రాడు ఏడుపు గొంతుకతో జవాబుచెప్పాడు :

"డబ్బు లివ్వకపోతే వాడు నాకు ఇవ్వడు నాన్నా! నిన్నే సీసా విసిరేశాడు. కొట్టడానికి వచ్చాడు. నాకు భయమే స్తోంది" అన్నాడు.

"చాప్, పాజీ వెధవా," బెంచీ మీద పడుకున్న ఆ పెద్ద మొహం మనిషి అరిచాడు. అతడికాళ్లు వూగుతున్నాయి. కమీజుకి గుండీలు లేకపోవడంవల్ల గుండెలమీది వెంట్రుకలు పైకి కనబడుతున్నాయి. అతడు మెడ మీదికెత్తి చీడీమీద తుపుక్కున వుమ్మేసి మళ్ళీఅన్నాడు: "దొంగవెధవా. వెళ తావా తన్నమన్నావా? ఇదిగో — ఒకటీ — రెండూ — మూడూ అనే సరికి వెళ్ళాలి. నే.........

"స్టీబకే," — పొయ్యి దగ్గిరినించి తల్లి, వొక పిల్లణ్ణి గుండెలమీద వేసుకునీ, వొకణ్ణి వేలుచ్చుకు నడిపించుకునీ వచ్చింది. భర్తకీ కొడుక్కీ మధ్యగా నుంచుంది. బతిమిలా డుతూ అంది ఆమె: "స్టీబకే కొంచెం ఆగు. కాస్త రొట్టె ముక్క తినేనీ వాడు. వెరుకుంటాడు.

"బాబూ, చూడమ్మా, తిండి తినేసి నాన్నకోసం సారా తెచ్చి పెట్టం!"

"ఉఁహూఁ" అంటూ తలవూపి గోణిగాడు హాంస్. "నాకు భయమేస్తోంది. వాడు నన్ను కొడతాడు. సారా తాగాడంటే నాన్నా బజాయిస్తాడు. ఉఁహూఁ, నేను వెళ్ళను. వెళ్ళను."

"ఊ — రు — కో. నీపుణ్యం వుంటుంది వూరుకో" భయపడుతూ, కొడుకు నోరు నొక్కేస్తూ మెల్లిగా అంది తల్లి. "చూడూ, నాన్న విన్నాడంటే — నువ్వు మంచి బాబువికదూ! కొంచెం పోనిచ్చి వెళ్ళమ్మా! సాలాలేక పోతే నాన్న కొంపకి నిప్పంటించేస్తాడు. నిన్నూ తంతాడు. నన్నూ చిదకగొడతాడు."

"నేను తెస్తే తాగేసి నన్నే తంతాడు. ఉఁహూఁ, నీ వంతూ నా వంతూ తాపులు నేను తినలేను" ఇటూ అటూ చూస్తూ అన్నాడు కుర్రాడు. "అమ్మా, అంతా తెలుసు నాకు ముందు ప్రేమిస్తాడు నిన్ను తరవాత తంతాడు. లేదా ముందే తంతాడు. తరవాత ప్రేమిస్తాడు. ఏం నిజమేనా?" అన్నాడు.

దుఃఖంతో బరువైన పెద్ద నిట్టూరుపు విడిచింది తల్లి. పాలిపోయిన ఆమెబుగ్గలమీద ఎరుపుచాయ తొంగిచూసింది. నీరసంగా వున్న శరీరం వొణికింది.

"ఒరేయ్!" బెంచీమీద పడుకున్న మనిషి జోరుగా బల్లగుద్దుతూ అరిచాడు. నువ్వు వెళుతున్నావా, లేదురా? ఈగొణగొణా సనగడాలూ — ఏమిటీ వేషమంతా అంటా! నోరు మూసుకుని ముందు వెళ్ళు! తియ్, ఊఁ, తియ్యి సీసా! తరవాత తిందువుగానిలే. తొందరలేదు. వెళ్ళు, పరిగెత్తు" అంటూ దిగివస్తున్నట్టు వొక కాలు బెంచీమీంచి కిందపెట్టాడు

ఊఁ!

కుర్రాడు సీసా తీసాడు. క్షణంలో ద్వారం అవతలకి వెళ్ళిపోయాడు. వెనకాల వినబడుతూనేవుంది తండ్రి నవ్వు.

* * *

" పాలమ్మే కుర్రాళ్ళలో ఎవడో మహాచెడ్డ వాడున్నాడు. దొంగ, పచ్చిదొంగ వాడు."

తుఫానులాగ ఈవార్త వ్యాప్తి అల్లుకుపోయింది.

వాణ్ణి పట్టుకున్నారు. నీలిచొక్కా తొడుక్కున్నాడు వాడు. నెత్తిమీద గీతలటోపీవుంది. మొహం దాచుకుందామన్నట్టు కిందికిలాగి పెట్టుకున్నా డది. పిల్లిలాగ కచేరీగుమ్మంలోంచి జారిపోబోయాడు కూడాన్నూ వాడు. పట్టేశారు పారిపోకండా కింద కూచోబెట్టారు. తక్కిన కుర్రాళ్ళు ఇద్దరేసీ, నలుగురేసీ వచ్చి వాణ్ణి చూస్తున్నారు.

హౌస్ స్టీబకే — రెండూ రెండూ కలిపితే ఎంతవుతుందో తెలియనివాడు హౌస్‌స్టీబకే. రోడ్డుమీద డబ్బులు పడివుంటే తియ్యడుసరికదా, పక్కనించి తప్పించుకుపోతాడు హౌస్‌స్టీబకే. వాడా అర్ధరూపాయి దొంగిలించాడు!! ఇంత తెలివి తక్కువా? బాకీ డబ్బులు వసూలు చేస్తున్నప్పుడు దొంగిలిస్తే డ్రయివరు కనిపెట్టేశాడట!

అసలు కథ ఏమిటంటే, హౌస్‌స్టీబకే దొంగిలించడం నిజం. అతడే వొప్పేసుకున్నాడు కూడాన్నూ. వొణికిపోతూ, బిక్క చిక్కని మొహంతో తనంతటతానే డ్రయివరుకి లొంగిపోయాడు. ఇన్సపెక్టరు దగ్గిరికి వచ్చేక నోరువిప్పలేదు. బిక్క

మొహం వేసి తలవొంచుకున్నాడు ఎంతో అంత తర్జనభర్జన జరిగింది.

"ఎక్కడ దాచావు అద్దరూపాయి?"

"... ... ..."

"ఏం రా, ఏంచేశా వది?"

"... ... ...

"ఆకలి వేసింది రా?"

"................."

"కేకులు కొనుక్కు తిన్నావా?"

దేనికీ జవాబు లేదు.

"స్టీబకే, మాట్టాడవేం? ఎక్కడుంది అద్దరూపాయి?"

తన దృఢమయిన చేయి హాంస్ భుజంమీద గట్టిగా వేస్తూ అడిగాడు ఇన్సపెక్టరు.

"ఏం రా, దొంగతనం తప్పని తెలియదూ? తెలిసిన్నీ డబ్బులు దొంగిలించావూ? సిగ్గు వెయ్యలేదూ నీకు? ఉరిపో నుకు చావలేకపోయావూ?

కళ్ళజోడు సర్దుకున్నాడు ఇన్సపెక్టరు. కుర్రాడి మొహం తీవ్రంగా చూశాడు.

"నీ నౌకరీ పీకెయ్యడం నాచేతిలో వుందని నీకు తెలును కదా! దొంగలికి మాదగ్గిర జాగాలేదు. ఏం, నువ్వు చెప్పే దేమయినా వుందా మరి?"

అరిచేగా, ఈనెపుల్లల్లా వున్న హాంస్ శరీరంలో మెరుపు పరిగెత్తి నట్టయింది. క్షమాపణ చెప్పుకుందికి చేతులుజోడిం చాడతను. వెక్కి వెక్కి ఏడవడం మొదలెట్టాడు.

"నానౌకిరీ తీసెయ్యకండి బాబయ్యా, దయచూడండి."

అతడి నోరు తొట్రుపడుతూవుంది. కళ్ళల్లోంచి నీళ్ళు బొటబొటా కారుతున్నాయి.

"బాబూ నౌకిరీ తీసెయ్యకండి. చంపేస్తాడు మాబాబు. కొట్టికొట్టి ప్రాణం చేసేస్తాడు. చచ్చిందాకా వొదిలిపెట్టడు. బాబూ, మరెప్పుడూ ఇలా చెయ్యను. నౌకిరీ తీసెయ్య కండి."

"మరి డబ్బెలెందుకు కాజేశావ్?"

హాంస్ మళ్ళీ మూగనోము పట్టాడు. అతడికాళ్ళు వొణు కుతున్నాయి. పెదవులు మాత్రం వొకదాన్నొకటి అంటి పెట్టుకున్నాయి.

"పంతగొట్టులా వున్నాడు."

పక్కమనిషితో అన్నాడు ఇన్స్పెక్టరు. హాంస్‌ని మళ్ళీ గద్దిస్తూ అన్నాడు.

"సరే, నువ్వు ఇంటికి వెళ్ళవచ్చు. నీ బాబుని సాయం కాలం ఇక్కడికి రమ్మను మాట్లాడాలి. ఊరికే బెక్కుతా వేం? ఏడిస్తే వచ్చేదేమిటి? వెళ్ళు. తిన్నగా ఇంటికి పో."

నీడ కదులుతున్నట్టు రోడ్లమీదంచి వెళుతూ కనిపించాడు హాంస్. ఎండ తీక్ష్ణంగావుంది. తారురోడ్లు అగ్గి మండు

తున్నాయి. ఇదంతా పట్టించుకున్నట్టే లేదు హాన్స్. ఇల్లు దగ్గరపడుతున్నకొద్దీ అతడి అడుగులు మందమవుతున్నాయి. తుదకి అతడు పాకుతున్నాడా అన్నట్టు వెళుతున్నాడు. ప్రతీ దుకాణం కిటికీ దగ్గిరా నుంచుండి పోతున్నాడు. కసాయి దుకాణం దగ్గిరికి వచ్చాడు. ఆదుకాణం దగ్గిరికి తల చేర వేశాడు.

ఇక్కడే ఆసంఘటన జరిగింది. నిన్న ఇక్కడే జరిగింది. ఇక్కడ నిన్న సరిగ్గా ఇవాళలాగే చేరబడ్డాడతడు. కిటికీదగ్గిర వేలాడుతూన్న మేకమాంసం లాలసత్వంతో చూస్తూ నుంచున్నాడు. గుటకలు మింగుతూ నుంచున్నాడు, నిజమే. కాని, ఆగుటకలు తనకోసం కాదు. కుక్క కోసం. వాకట్లో వోమూల పడివుండే ఆ ఫ్లూటోకోసం. ఆకలితోనూ, దాహంతోనూ బాధపడుతూ నాలిక చూచుకుని వుంటుం దది. ఈగలూ అవీ దాని బాధపెడుతూ వుంటాయి. దానికి ఇంత తిండి వేసేవాడే లేడు. దాని యజమాని లెహమాన్న లుబ్ధాగ్రేసర చక్రవర్తి. పగలనక, రాత్రనక దానిచేత రోడ్ల మీాద బండి లాగిస్తూవుంటాడు. తన స్వంతానికే దమ్మిడీ ఖర్చుపెట్టడు. ఇహ ఫ్లూటో సంగతి చూసేదేమిటి ? హాన్స్ మాత్రం ఏం చెయ్యగలడు ? అతడికి దొరికేదే అంతంత; చిన్నరొట్టెముక్క. అది ఫ్లూటోకి వాకు దవడికిందికే రాదు.

హాన్స్ మాంసం దిక్కు చూస్తున్నాడు. ఆదేసమయానికి లేహమాన్న బండితోలుకువచ్చాడు. సంచులు

దొంతులుగా బండిమీద వున్నాయి. లెహమాన్న బండి వెనకాల నడుస్తున్నాడు. కుక్క ఫ్లూటో బండిలాగుతోంది.

అది మరి నడవలేక పోతూవుంది. "ఊఁ, నడూ! బద్ధకం వెధవకుక్కా!"

కుక్క లాగింది. మొహం ముందుకి చాచింది. వెనక కాళ్ళు బరువుకి తగిలాయి. అంతే. లాగలేక పోయింది. తన ప్రయత్నమంతా వ్యర్థమే అయింది. బండి కదల్లేదు.

ఒక్కటి ఛళ్ళున తగిలించాడు లెహమాన్న.

"గాడిదా, నడుస్తావా లేదా?"

ఫ్లూటో వొణికింది. బలమంతా కుద్దించింది. ముందుకి ప్రయత్నించింది. బండి కొంచెం కదిలింది. కాని, మళ్ళీ అగిపోయింది. కుక్క కిందపడుకుండి పోయింది.

"స్కౌండ్రల్" అంటూ అరిచాడు లెహమాన్న. కోపంతో కందగడ్డలా అయిపోయా డతడు. కాలెత్తి కుడీ ఎడమా అనకండా తాపుమీద తాపు కుక్కని తన్నడం లంకించుకున్నాడు. కుక్క దుఃఖంతో అరుస్తోంది. బాధతో వొక్కపెట్టుని నోటికొద్దీ అరిచింది.

దుకాణం కిటికీదగ్గిరనుంచి మెరుపులా పరిగెత్తుకువచ్చాడు. హాఁస్. కుక్కకీ దాని యజమానికీ మధ్య నుంచున్నాడు. "మాస్టర్ లెహమాన్న, నీ పుణ్యముంటుంది, దీన్ని కొట్టకు. పాపం, దీన్ని కనికరించు" అంటూ దీనంగా బతిమాలాడు.

కుర్రాడి కమీజు నలిపిపట్టుకున్నాడు లెహమాన్న్. వాడి చెవులు నులిపినంతపని చేశాడు. "చచ్చుదద్దమ్మా, పో. నీపనేమో నువ్వు చూసుకునిఏడు."

మరోగట్టి తావు తగిలింది కుక్కకి. లేచి నుంచుందికుక్క. బండి మెల్లిమెల్లిగా బందుకి కదిలింది.

గుండెలనిండా బాధ బరువుగావుంది హాంస్‌కి. కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నాయి. ఫ్లూటో అవస్థచూస్తూ అలాగే ఆగిపోయా డతడు.

కసాయి దుకాణంలో వేలాడుతున్న మాంసంముక్క కళ్ళ ముందు కట్టినట్టుంది. ఊగుతోంది దది. రమ్మని పిలుస్తున్న ట్టుంది. ఆహా! ఫ్లూటో! — ఫ్లూటోకి ఆముక్క దొరికి తేనా!

ఇది నిన్నటి మాట.

ఇవాళ డబ్బులు దొంగిలించాడు హాంస్‌స్టీబకే. అతడు డబ్బులు పట్టుకు వెళుతూవుంటే తక్కిన కుర్రాళ్ళు అతణ్ణి వేలెత్తి చూపుతున్నారు. ఒకళ్ళతోవొకళ్ళు ఏవో గుస గుసలాడుతున్నారు. మేడ కప్పులమీద పిట్టలు అరుస్తు న్నాయి.

"దొంగ. దొంగ."

తన తండ్రితో సంగతంతా ఇన్స్పెక్టరు చెపుతాడు. ఇదంతా అతడి తలలో గిర్రుమంటూవుంది. కళ్ళల్లో నీళ్ళు

తిరుగుతున్నాయి. అయినా అతడి మొహంలో విజయ సూచకమయిన వొక తెలుపు కనపిస్తూనేవుంది. జంకుతూ, జంకుతూ నాలుగు దిక్కులూ చూశా డతడు. నోటి దగ్గర చెయ్యిపెట్టాడు. నోట్లోంచి పిల్లింగు బైటికిలాగాడు. పిడికిల్లో బిగించి పట్టుకున్నాడు. దగ్గర దుకాణంలోకి దూరాడు. రెండు నిమిషాల్లో చిన్నపొట్లాం జేబులో పట్టుకుని పైకి వచ్చాడు. ఒక్కవూపుని, — ఎవరో వెంట తరుముతునట్లు, ఇంటిదిక్కు పరిగెత్తాడు.

దొడ్డిలో ప్రవేశించాడు హాంస్. ఎప్పుడూ కంపు కొడుతూ, చీకటిగావుండే దొడ్డి ఇవాళ మాంచి ఉజ్వలంగా కనిపించిం దతడికి. పాలిపోయిన అతడిబుగ్గలు సంతోషంతో నిగనిగ లాడుతున్నాయి. గుండెల్లో ఆవేగమూ, దడా వున్నాయి. ఇంతవరకూ అతను ఎప్పుడూ ఇలాంటి ఆనంద అనుభవించిన పాపానపోలేదు. తిట్లూ, తాపులూ — అన్నీ మరిచిపోయాడు. ఆఆనందంలో అతను సంతోషంతో పళ్ళు పైకిచూపిస్తూ, దొడ్డిలో మూల కుక్క దగ్గిర ముడుకులుమోపి కూచున్నాడు. కుక్క మట్టిరంగుశల తన దడదడలాడు తూన్న గుండెలమీదికీ లాక్కున్నాడు.

“ ఫ్లూటో, నానేస్తం, ఇదిగో నీకోసం తెచ్చాను. ”

కుక్కతలమీద దెబ్బ. చర్మంచిగిలి లోపలిమాంసం పైకి కనిపిస్తూవుంది. గుడ్లనీళ్ళుతిరిగాయి హాంస్‌కి.

"మళ్ళీ కొట్టాడా ? ఆ — ! ఫ్లూటో, అరిచావా ? ముసిలి ఫ్లూటో, నానేస్తం, ఏడ్చావా ? వద్దు. — ఇదిగో నీకోసం మాంసం తెచ్చాను."

కుక్క వాసనచూసింది. మూచూసీ చూడడం తోనే దానికళ్ళు మెరిశాయి. నోరు విప్పింది. హాంస్ సంతోషంగా మాంసం కోసి, ముక్కతరవాత ముక్క కుక్కనోట్లో వేయడం మొదలుపెట్టాడు. మాంసం క్రమంగా తరుగుతూ వచ్చింది. అయినా ఫ్లూటో ఇంకానోరు చూస్తూనే వుంది.

"అయిపోయింది. మరిలేదు. ఫ్లూటో, ఇంతే. ఇంతే దుకాణంవాడు షిల్లింగుపుచ్చుకుని ఇచ్చాడు. ఓ, అంతా నీకడుపులోకి వెళ్ళిపోయింది. ఇకవాళ్ళు నన్నుపట్టుకు తీసుకుపోసి. భయంలేదు."

హాంస్‌తండ్రి ఇన్స్పెక్టరు దగ్గరనుండి తిరిగివచ్చేక హాంస్‌కి దెబ్బలు తప్పలేదు. దయాదాక్షిణ్యంలేని దెబ్బలు తిన్నాడతడు. నోటికివచ్చినట్లల్లా తిట్టాడు తండ్రి.

"లుచ్ఛా, దొంగా!"

కిందపడవేసి చేతులు తీటతీరేట్లు కొట్టాడు హాంస్‌ని. చేతులువీకేక కాళ్ళతో లంకించుకున్నాడు.

"డబ్బులు ఎక్కడున్నాయో చెప్పు! ఆషిల్లింగు నువ్వు ఏంచేశావో చెప్పు. నిన్ను చంపేసి మరీ వాటలిపెడతాను."

"స్టీబకే, నీపుణ్యముంటుంది. స్టీబకే"

హాంస్ తల్లి పిచ్చెత్తినట్టున్న తండ్రిచెయ్యి పట్టుకుంది.

"నిజంగా చచ్చిపోతాడు వాడు. కాలో చెయ్యో విరిగి పోతుంది. తరవాత చేసేదుండదు. స్టీబకే, నీఘాన్యా ముం టుంది."

నోటికొద్దీ అరుస్తుందామె. తక్కిన పిల్లలూ మొర్రో మొర్రో అంటున్నారు.

"కేకలు మానంతావా లేదా? నోరు ముయ్యి ముందు. నిండ ఎవడి దనుకున్నావ్! ఏం, ఇదేనా నిన్ను పెళ్ళిచేసు కున్న తప్పుకి ఫలం? ఛండాలం ముండా! నాముందు పీడి విలువేమిటంటా? పీణ్ణి చంపి తేకాని, వొదిలిపెట్టను.

"స్టీబకే!"

"నోరుముయ్యి!"

గాట్టి దెబ్బ తగిలిన శబ్దమయింది.

"అమ్మో" అని పెద్ద కేక.

ఆడది అంతదూరంలో వెళ్ళిపడింది. ఓమూల కూలబడి పోయిందామె. కొడుకు ఏడుపు వినలేక, రెండు చేతులతో నూ చెవులు మూసుకుంది.

ఆఖరికి వాడికోపం తగ్గింది. కుర్చీమీద వెళ్ళి చదికిల బడ్డాడు. గోణగడం మొదలుపెట్టాడు.

"ఎంతో నమ్మకమైన వాణ్ణి నేను."

గాడిద.

దొంగ వెధవ.

ఇన్స్పెక్టరు నన్ను చూడగానే అన్నాడు. స్టీబకే, నమ్మకమైనవాడివి నువ్వు మర్యాదస్తుడివి. నీ మొహం చూసి, నీ కొడుక్కి మరో అవకాశ మిస్తున్నాను. చూడూ, మళ్ళీ ఇలా వోసారి జరిగితేమాత్రం వాణ్ణి నౌకిరీనుంచి తీసేస్తాను" అని.

ఇదిగో, వోరేయ్ హాంస్, మళ్ళీ ఇలా చేశావంటే నిన్ను మహామ్మాయి వొండేస్తాను.

తరవాత ఏమయితే అదవుతుంది.

గోరలీబ్ స్టీబకే ఇప్పటిదాకా ఎప్పుడూ నమ్మకద్రోహం చెయ్యలేదు.

బతుకంతా నేను చెమటోడ్చి, చస్తావుంటే ఈ వెధవ ఇలా సర్వనాశనం చేస్తాడూ !"

చివరిమాటలు సరిగ్గా వినపడలేదు. అంతలోనే అతడు గుర్రు మొదలుపెట్టాడు.

ఆకాశంమీద చుక్కలు మెరుస్తున్నాయి. డేగతూ హాంస్ బైటికి వచ్చేసరికి అందులో వొకటి సరిగ్గా దొడ్డిలో మీద మెరిస్తూవుంది. అతడు నడవలేక పోతున్నాడు. అతడి ప్రతీ అవయవమూ నొప్పిగా పులిసిపోయివుంది. ఎలాగో ఈడ్చుకుంటూ మెట్లదగ్గిరికి వెళ్ళాడు. దొడ్డిలో తడువు కుంటూ వెళ్ళి కుక్కపడివున్న మూల చేరాడు. కుక్కదగ్గిర చాపచుట్టగా పడిపోయి బెక్కడం మొదలుపెట్టాడు. మెల్లి

మెల్లిగా మొరుగుతూ ఫ్లాటో అతడి మొహం నాకింది. తుదకి పాదాలమీద శరీరంవాల్చింది.

ఇద్దరూ అక్కడ అలా అలిసిపోయి, మూలుగుతూ బాధతో పడివున్నారు. వాళ్ళమీద బంగారం నక్షత్రం మెరుస్తూ వుంది. ఐతే, వాళ్ళుమాత్రం దాన్ని చూడలేదు.

కొన్నాళ్ళయాక—

"ఒరే, కుర్రాడూ, పెన్సిలు రెండూ ఏవిరా? ఎక్కడున్నాయి? ఏం, నువ్వే కొట్టేశావా?"

డ్రయివరు హాన్స్ భుజాలు పట్టుకుని వూపుతూ అడిగాడు.

"నేను తియ్యలేదు. నిజం. నేను దొంగిలించలేదు. అయ్యో!"

ఉత్తిచేతులు చూపిస్తూ అన్నాడు హాన్స్.

పాలబండి దగ్గిర రోడ్డుమీద నుంచుని వున్నారు వాళ్ళు. సీతాకాలం చలిగాలి పండుటాకులు తెచ్చి వాళ్ళకాళ్ళముందు పడేస్తూ వుంది.

ఎండుటాకుల్లాగ చలిగాలిలో వణుకుతున్నాడు హాన్స్. అతడిపళ్ళకి పళ్ళు తగులుతున్నాయి.

"లేదు. చూడు. నాదగ్గిరలేదు. మిస్టర్ సూల్జే, నామీద ఫిర్యాదు చెయ్యకు. నేను తియ్యలేదు. తియ్యలేదు నేను."

మతిపోయినట్టు మాటిమాటికీ ఇదే అంటున్నాడు. హాన్స్.

"ఆ మాత్రం తెలీదటోయ్!"

మామ్మూల్మలు మాటగా అన్నాడు డ్రయివరు.

"పద. నాతో కచేరికి పద. నేను ఫిర్యాదు చెయ్యక తీరదు."

కుర్రాడి కాలరుపట్టుకున్నాడు డ్రయివరు.

ఐతే చివరికి రెండుపెన్నీలూ ఏమయినట్టు? ఎక్కడన్నా పడిపోయాయా? లేదా చిల్లరవాపసు చేసేటప్పుడు పొరపాటున ఎవరికయినా అధికం వెళ్ళిపోయిందా? ఏమయినా అవి పోవడమేమో నిజం. హాన్స్‌ట్రీబకే వొకసారి దొంగతనంచేసి దొరికిపోయాడు. ఇప్పుడు మాత్రం అతడు కాదని ఎలా తప్పుతాడు?

"నౌకరీ తీసెయ్యవలసిందే ఇక" అన్నాడు ఇన్స్‌పెక్టరు. "నీబాబుతో చెప్తాను."

ఊగుతూ, తూలుతూ కల్లుతాగినవాడిలా తన పరిచితమయిన సందుల్లో నడవడం మొదలెట్టాడు హాన్స్. వాళ్ళు అతణ్ణి నమ్మలేదు. ఎలానమ్ముతారు? అయితే, తరవాత ఏమవుతుంది? భయం దెయ్యంలా అతడినెత్తిమీదకూచుంది. వేసవిలో తన దుర్బలశరీరంమీద కురిసిన గుద్దులు జ్ఞాపకం వస్తున్నాయి. చలికాలం వచ్చింది. అయినా ఆనొప్పులు వొదలలేదు. తనతండ్రి లేనిపోని అబద్ధప్రతిజ్ఞలు పలకడమూ, భయపడుతూ తల్లి అడ్డగోవడమూ, తాను వేసిన కేకలూ మూలుగులూ అన్నీ ఇప్పుడూ అతడికి వినిపిస్తున్నాయి. అతడి కనుబొమలమీద చెమటబిందువులు చిమ్మాయి. మెల్లిమెల్లిగా

అవి బుగ్గలమీంచి ధారలు కట్టాయి. తల తిరిగినట్టయింది. కళ్ళు మూసుకున్నాడతడు.

ఎక్కడికి వెళ్ళడం ? ఎక్కడికి ? అడివికి వెళ్ళిపోతేనో ! పట్టి తీసుకు వచ్చేస్తారు. ఏం చెయ్యాలి ? ఈ విశాలప్రపంచం రోడ్లమీద తిరుగుతూ వుండాలా ? అక్కడయినా, ఎక్కడయినా పట్టుకుంటారు.

బెంగగా చిక్కితే నెత్తురుచుక్క లేని మొహంతో ఇంటికి వచ్చాడు హాంస్. ఎవ్వరితోనూ ఏమీ చెప్పలేదు. వాళ్ళ మట్టుకు వాళ్ళే తెలుసుకుంటారు.

" ఏం బాబూ, వొంట్లో బావుండలేదా ? "

మోటుచేతుల్తో అతడి జుత్తు నిమురుతూ అడిగింది తల్లి. నిజంగా కొడుకంటే ఆమె ప్రాణం పెడుతుంది. అయితే తన ప్రేమ వెల్లడిచేయడానికి మాత్రం ఆమెకి సాహసం చాలదు. ఇవాళ తండ్రి ఇంటిదగ్గిర లేడు.

" ఏం నాయనా, జబ్బుగావుందా ?"

మెల్లిగా తల వూపి జవాబు చెప్పాడుహాంస్. తిన్నగా పడుకునే చోటికి వెళ్ళాడు. రోజూ తక్కిన పిల్లలతో రాత్రిళ్ళు పడుకునే చిన్నమంచంమీద పడుకున్నాడు.

మొహం గోడదిక్కు తిప్పుకున్నాడు.

చెమటలో ముద్దయిపోతోంది శరీరం.

చేతులు బొంతకింద పెట్టుకున్నాడు.

ప్రార్థనా అదీ చెయ్యలేక పోయాడు.

ఆ అలవాటే లేదతడికి.

అయినా, ఎవర్ని ప్రార్థించడం ?

అతడి నెత్తిమీద భయం దెయ్యమై కూచుంది. సాయంత్రం తండ్రి ఇంటికివచ్చాడు. మంచి ఉషారైన నిషామీద వున్నాడతడు.

" కుర్రవెధవ ఎక్కడున్నాడు ? "

హాన్స్ వొణకడం ప్రారంభించాడు. కాళ్ళనుండి తలదాకా కప్పేసుకున్నాడు బొంత. ఊపిరి తియ్యడానికయినా అతడికి ధైర్యంలేదు.

" వాడికి జబ్బుగావుంది. "

తల్లి చెప్పింది.

" ఏమిటీ ? గంగలోపడనీ దొంగవెధవ. రేపటిదాకా ఆగు. తెల్లవారాక— నేను— "

పక్కమీద వాలాడతడు. అంతలోనే టోకుర్లుప్రారంభించేశాడు.

" రేపు ? — తెలిసిపోయిందా ఏవిటి చెప్మా ! — తెలియదా ? "

జలుబూ, జ్వరంతో కుర్రాడు అదేపడకడం పడుకుతున్నాడు. మండుతూవున్న కళ్ళు చీకట్లో అంతలేసి చేసుకు చూస్తున్నాడు. అతడి మనస్సులో ఏదో తీవ్రమయిన ఆలోచన వేస్తోంది. భయంకంటే తీవ్రంగా వుందది. ఎటయినా

పోవాలనీ, ఎక్కడయినా అంటుకు పోవాలనీ, పగిలిపోతూ వున్న తలకాయ కాపాడుకోవాలనీ కోర్కెగా వుంది.

ఫ్లూటో ! —

హఠాత్తుగా మందహాసం చేశాడు కుర్రాడు. అవును. అదే సరయింది.

మురిలిఫ్లూటో.

తెల్లవారగానే అతడు ఫ్లూటోదగ్గర చేరతాడు. ఫ్లూటో దగ్గర — ఫ్లూటో —

హాన్స్ మనస్సులో ఆలోచనల కెరటాలు. ఒక ఆలోచన లేస్తుంది. వెళ్ళిపోతుంది. మరొకటి లేస్తుంది. అదీ వెళ్ళిపో తుంది. ఇంకోటిలేస్తుంది. - కానైతే, అన్నిటిలోనూ ఫ్లూటో వుంటుంది.

చివరికి నిద్రవచ్చేసింది. అతడి చేతులు బొంతమీద వున్నాయి. నోరు తెరిచి వుంది.

అతడి వూపిరి చప్పుడుకే అతడినిద్ర తేలిపోయింది. అంత సేపూ గాఢంగానేపట్టింది నిద్ర. పాలిపోయిన అర్ధచంద్రుడు కనిపిస్తూనేవున్నాడు. ఇంకా తెల్లవారలేదు.

ఊపిరి బిగబట్టి మెల్లిగా అడుగులు వేస్తూ లేచాడు హాన్స్. కాళ్ళూ చేతులూ కడుక్కున్నాడు. తల చక్కగా దువ్వు కున్నాడు. నీలికమీజు వేసుకున్నాడు. పచ్చగీతల టోపీ పెట్టుకున్నాడు. చప్పుడు చెయ్యకండా తల్లిమంచం దగ్గిరికి

వెళ్ళాడు. ఒకక్షణం ఆమెని చూస్తూ నుంచున్నాడు. తరవాత తలుపుతీసి బైటికి జారిపోయాడు.

స్టీబకే – జోళ్ళుకుట్టే స్టీబకే అర్ధరాత్రిలాగే ఇప్పుడూ గట్టిగా టోకుర్లు తీస్తున్నాడు. కాని, అతడిభార్య గట్టిగా ఎవరో పిలవడం విని లేచింది. పిలుపు దొడ్డిలోంచే వచ్చింది.

“ స్టీబకే! ఏమమ్మో, స్టీబకే ! స్టీ-బ-కే !

ఏదో గందరగోళం జరిగిందా ? మంచంమీంచి పిల్లలూ లేచారు ; అరవడం మొదలెట్టారు. నిద్రబద్ధకంతో ఆమె పులికిపడి లేచింది. గబగబా గౌను తొడిగింది. ఉత్తికాళ్ళ తోనే పడుతూలేస్తూ కిటికీ దగ్గిరికి వెళ్ళింది. బైటినించి కిటికీ కొడుతున్నారు.

“ స్టీబకే! ఏమమ్మో స్టీబకే ! ఓ-స్టీ-బ-కే ! ”

“ ఏమిటి ? ఏమయింది ! ”

ఆమె వణకడం ప్రారంభించింది. ఏడుపుధ్వని బాధగా వుంది.

“ ఇలారా ! పైకిరా ! పైకీ ! వేగం !!

చప్పున ! అయ్యో ! నీకొడుకు ! ఏదో అయిపోయింది వాడికి !! ”

“ ఏదో అయిపోయిందీ ? ఏదయిందమ్మా ? ”

తల్లిశరీరంలో భయం కెరటాల్లా పరిగెత్తింది. భర్తని లేపేసింది.

“ స్టీబకే ! ”

స్టీబకే ఇటునించి అటు వొత్తిగిల్లాడు. అంతే. మళ్ళీ టోకుర్లే మొదలెట్టాడు.

బైటగోల మరింత హెచ్చిపోయింది. మనుష్యుల కేకల్లో మధ్యమధ్య కుక్క మొరగడమూ వినిపిస్తోంది. నిలువునా కంపించి పోతూ హాఁస్ తల్లి బట్టలు కట్టుకుంది. ఆమె బైటికి రావడమే తడువు – అంతమందీ వొకటేగోల. కుక్క కట్టి వున్న మూల అందరూ మూగివున్నారు.

"ఆ, ఏమయిందీ? ఏమిటయిందీ?"

"ఘోరం!– స్టీబకే కొడుకు! రామరామ!!

హాఁ – సా –?

జనం పక్కకి తప్పుకున్నారు. తల్లి బలవంతంగా లోపల దూరింది. దూరీ దూరడం తోటే ఆమె వొక్క అరుపు అరిచింది. దొడ్డి దొడ్డంతా ప్రతిధ్వనించింది అరుపు. దానికి ప్రతిధ్వనిలా వుంది కుక్క అరుపు.

కుక్క కట్టివున్న దగ్గిర, మీద గోడకి వొక ఇనప నాగ వాసం వుంది. దానికో తాడూ – తాడుతో వొక కుర్రాడి దేహమూ వేలాడుతున్నాయి. పచ్చగీతలటోపీ కింద పడి వుంది. ప్రాతఃకాలంగాలికి కుర్రాడి ముంగుర్లు కదలాడు తున్నాయి. నోరు తెరిచి వుంది. కళ్ళు పైకివచ్చేసి మెరుస్తున్నాయి.

వేలాడుతూన్న కుర్రాడి దగ్గిరికి వెళ్ళాలని, పిచ్చెత్తినట్టు కుక్క వురుకుతూ వుంది. కాని వెళ్ళలేక పోతోంది. కింద

సాగిలబడుతోంది. మీదికి నోరెత్తి అరుస్తోంది. ఎవ్వరినీ దగ్గిరికి రానివ్వకండా వుంది.

కుక్క దగ్గిర నల్లటి గోడమీద, చదవడానికి వీలుగా, కుర్రాడు చేత్తో రాసిన పెద్దపెద్ద అక్షరాలు కనిపిస్తున్నాయి.

"రెండు పెన్నీలు నేను దొంగిలించలేదు.

ఫ్లూటోని బాగా చూడండి.

హోరేస్ స్టీబకే.

పాలమ్మే కుర్రాడు.



# ఇవానా

"ఇవాళ ఉదయం చార్లస్ రాబర్ట్సుతో పరిచయమైంది. అతడు నీకు నమస్కారం చెప్పమన్నాడు—"

ఇవానా కాఫీకప్పు భర్తకి అందించేటప్పుడు, వార్తాపత్రిక మీంచి మొహమెత్తి ఆమెభర్త అన్నాడు.

ఉత్సాహంలేని కళ్ళు మీదికెత్తి, వోసారి వాకిట్లోని పూలతోటకేసి చూసింది ఇవానా. అస్తమిస్తూన్న సూర్యుడి ఎర్రటికిరణాలు రంగురంగుల పువ్వులమీదపడి చిత్రచిత్రంగా వుంది పూలతోట.

"అతడు ఈవూళ్ళోనే వుంటున్నాడా, ఇప్పుడు?"

"చాలా దినాలై ఇక్కడే వుంటున్నాడు. పట్నం తూర్పుభాగంలో కాపురం. తీరుబడిమాత్రంలేదు. కోర్టు బారు లైబ్రరీలో తరుచు కనపడుతూ వుంటాడు. అతడిది ఫ్రీజ్‌లాండ్ (Friesland) అనే బాల్యంనించీ మీఇద్దరికీ బాగా పరిచయమనీ, ఇవాళే అతడితో మాట్లాడాక తెలిసింది నాకు."

"ఆఁ,—అవును— మా ఇద్దరి ఇల్లూ వొకవూళ్ళోనే అయితే, పెళ్ళయిందా అతడికి?"

"లేదు ఇంకా కాలేదు. పెళ్ళిచేసుకునే వయస్సుకూడా ఇంకా మించిపోలేదు. ఇంత చిన్న వయస్సులోనే ప్లీడరీలో అతడికి మంచి ప్రాక్టీసు లభించింది."

నాకంటే అతడు రెండేళ్ళు పెద్ద. వయస్సు యినా, ముప్పయి కంటె తక్కువ వుండవు."

ఏదో పరధ్యానంగా చెప్తోంది ఇవానా.

"అవును. కావచ్చు. సరేకానీ, చూడూ, బైటికి వెళుతున్నాను. రాత్రికి రాను."

"నేను బైటికి వెళుతున్నాను. రాత్రికిరాను" — ప్రేమా ఏమీలేని ఈఉపస్సారమయిన మాటలు ఎప్పుడూవినడం పదేళ్ళనించీ పరిపాటే అయిపోయింది ఇవానాకి. తనమీద భర్తకి వున్న ఈ తాచ్ఛిల్యభావం ఆమెకి దుర్భరంగా తయారైంది. లేనిపోని కల్లబొల్లిప్రేమ చూపించి భర్తని ఆకర్షించడం ఆమెకి మనస్కరించదిప్పుడు. ఏది ఎలా పోతేనేం అన్నట్టు ఉదాసీనంగా వుంటుందామె. ఏదో వైరాగ్యభావమూ, విషాదమూ ఆమె హృదయాన్ని ఆవరించాయి.

పిల్లలకోసం మెల్లిమెల్లిగా భోజనం తయారుచేస్తోందామె. మనస్సుమాత్రం మనస్సులోలేదు తలలో ఏవేవో జ్ఞాపకాలు మేలుకుంటున్నాయి. ఎప్పుడో గడిచిన — చిరకాలం నాటి జ్ఞాపకాలవి

ఇవాళటి ప్రసిద్ధన్యాయవాది రాబర్టు ఆనాడు వొక పల్లెటూరి పిల్లాడు. సభ్యత అంటే ఏమిటో తెలియదతడికి. అందచందాలు అసలే లేవు. రోజూ ఇవానా వెంట తిరిగేవాడు. ప్రేమ వెల్లడిస్తూ ఆమె ప్రాణాలు తోడుకుతినేవాడు. సామాన్య మర్యాదాకూడా తెలియని ఆ మూర్ఖ

శిఖామణి వికారం చూసి నవ్వుకునేది ఇవానా. రాబ్ అంటే ఇష్టమే ఆమెకి. కాని, అతణ్ణి భర్తరూపంలో భావించడానికి ఆమెకల్లోకూడా సాహసించలేదు. అందుకనే అతడు గాఢమయిన నిట్టూర్పు విడిచినప్పుడల్లా ఆమె తీక్ష్ణమయిన తిరస్కారంతో నవ్వుతూ అతణ్ణి కుంగదీసి వొదిలిపెట్టేది.

ఐతే అనుకోకుండా జీవితంలో పెద్ద మార్పు వచ్చేసింది.

రాబర్టు యూనివర్సిటీలో చదవడానికి వెళ్ళిపోయాడు. ఇవానాకి పెళ్ళయిపోయింది. ఆటపాటలతో గడిచిన బాల్య జీవితం స్మృతిగా మాత్రం దాచిపెట్టినట్టు వుండిపోయింది.

ఇవానా పెళ్ళయి పదేళ్ళయింది. ఈపదేళ్ళలోనూ నిజమైనప్రేమ వొకనాడూ అనుభవించి ఎరగదామె. చిన్ననాటి ఆ అద్భుతమైన తన ఆటలనాటినేస్తం రాబర్టు ఇవాళ వొంటి మాటికీ కళ్ళముందు కట్టినట్టు జ్ఞాపకం వస్తున్నాడు.

ఆటల్లో ఇవానా దగ్గిర వోడిపోయినట్టు బుద్ధిపూర్వకంగా వొప్పుకునేవాడు రాబర్టు. గుడ్లనీళ్ళు తిప్పుకుంటూ ఆమెకేసి చూసేవాడు. ఆచూపుల్లో పూరికే అర్థంకాని బాధ చీకటిలా కమ్ముకుంటూ కనిపించేది. గెలుచుకున్న ఇవానా గర్వంతో, ఉడికించే తీక్ష్ణమైన నవ్వుతో దానికి బదులు చెప్పేది. హృదయంలేని ఆనాటి తన స్వభావం జ్ఞాపకంవచ్చి ఇవాళ వొకవిధమైన వేదన — ఆర్ద్రమూ, కోమలమూ అయిన వేదన ఆమె హృదయంలో మొలకలెత్తుతోంది.

పిల్లల అల్లరి కేకలు ఆమె ఆలోచనమేఘాలు చెల్లా చెదురు చేసేశాయి.

గోలచేస్తూ వాళ్ళు గదిలో ప్రవేశించారు, టెడీ, ఏమా. టెడీ తల్లివాళ్ళో చదికిలబడ్డాడు. ఏమా తల్లివీపుమీద ఎక్కింది ; చిన్న చేతుల్తో ఆమె మెడ చుట్టేసుకుంది. ఆనందంలేని ఇవానా నీరసజీవనంలో స్వర్గం తెచ్చిపెట్టేవాళ్ళు పిల్లలు. ఇద్దరూ తల్లిదగ్గిర వాళ్ళపుస్తకాలు విప్పికూచున్నారు. ఒకడు పాఠాలు వినిపిస్తే, వొకతె అర్థాలు అడగగడం మొదలుపెట్టింది.

ఇవానా మనో నేత్రాలనించి గతకాలంనాటిచిత్రం మెల్లి మెల్లిగా చెరిగిపోవడం మొదలైంది. చివరికి పూర్తిగా మాసిపోయింది.

చలికాలం.

ఒకనాటి ఉదయం—

ఉదయసూర్యుడి కిరణాలు పట్నంలోనివెడల్పాటి రోడ్డు మీద హాయిగా ప్రకాశిస్తున్నాయి.

ఎండదిక్కు వీపుపెట్టుకుని ఎవరో జాలిగా బిచ్చమడుగుతున్నాడు.

పత్రికలమ్మే కుర్రాడు విదేశవార్తలతో గావుకేకలు వేస్తున్నాడు.

రోడ్డు రెండుపక్కలా వచ్చీపోయేజనం అధికమవుతున్నారు.

ఒకబంధువు ఇంటినించి భర్తతో తిరిగివస్తోంది ఇవానా. కొంతదూరంవచ్చాక ఇక్కడ వాకక్షయింటుతో పనివుంది నాకు. నువ్వు వొంటరిగా ఇంటికి వెళ్ళిపోగలవా ? ఏమయినా ఇబ్బందా" అన్నాడుభర్త.

"ఏమీా ఇబ్బందిలేదు."

సరిగ్గా ఆదేసమయానికి రోడ్డుకి రెండోపక్కనడుస్తూన్న జనంలో వొకరిమీాద ఇవానా చూపుపడింది. ఉత్తరక్షణంలో అతడిచూపూ ఇవానాచూపుతో కలిసింది. వెంటనే, సిగ్గుపడ్డట్టు కళ్ళుకిందికి వాల్చేసుకుంది ఇవానా. ఆతడు రోడ్డు దాటి ఇటువచ్చాడు. తలమీాంచి టోపీతీసి మర్యాదగా వందనంచేశాడు. అతడికేసి వోసారిచూసి తలవొంచుకునే జవాబుచెప్పింది ఇవానా.

అతడి చూపులు ఇవానా గుండెలు చీల్చుకు పోయినట్లయింది.

గాయపడిన చూపులవి.

దుఃఖంతో కుములుతూన్న చూపులవి.

కల్మషంలేని ప్రశాంతమైన చూపులవి.

ఆమెకి బాగా తెలిసిన చూపులవి.

ఆమెభర్తతో రెండుమూాడు మాటలాడి, మళ్ళీవోసారి ఇవానాకేసిచూసి వెళ్ళిపోయాడతడు.

"రాబర్టు చాలా మంచిమనిషి. అతడినడవడి చాలా మంచిది."

పరధ్యానంగా ఇవానా ఏదో జవాబు చెప్పింది. సరిగ్గా అర్థం కాలేదు.

"పేపర్లో చదివాను. ఒకపెద్ద కేసుమీద రాబర్టు ఎమస్ట ర్డము వెళుతున్నాడు. అదృష్టవంతుడు.— సరే, నేను వెళు తున్నాను—" నోటిమాట నోట్లోనేవుంది. ఇవానా భర్త వాకిట మలుపు దగ్గిర ఆమెని వొదిలి వెళ్ళిపోయాడు.

ఇవానా పరధ్యానంగా నడుస్తోంది. మానసికంగానూ, శారీరకంగానూ ఏదో అవ్యక్తమైన స్వప్నంలో మునిగినట్టుంది, ఆమె.

అతణ్ణి కలుసుకుంటేనా? ఎన్నో అన్ని మాటలుమాట్లాడు తుంది ఇవానా. తన వూళ్ళోని మాటలు — చిన్నప్పటి మాటలు—ఆనాటి స్నేహం, జుట్టూ గురించిన మాటలు — ఇంకా, ఎన్నో అన్నిమాటలు.

ఇవానా నడకలో వేగం తగ్గుతోంది. అలాగే సందు నాలుగురోడ్లూ కలిసేచోటికివచ్చింది. తమవాకిలి ముందు పూలతోట గేటు కనిపిస్తోంది. గేటుమీంచి పొద్దుతిరుగుడు పువ్వు సగం విడుతూ తలవూపుతోంది.

హఠాత్తుగా, పరిచితమైన కంఠం విని ఇవానా తుళ్ళి పడింది.

కల చెదిరిపోయింది.

కళ్ళెత్తి చూసింది.

ఎదురుగుండా రాబర్టు!

నిలువునా ఆపాదమస్తకం కంపించిపోయిందామె. మొహం ఎర్రపడింది. గుండెల్లో నెత్తురు గడ్డకట్టినట్టయింది. ఎలాగో తనని తాను సమాళించుకుంది.

"నమస్తే రాబ్, బావున్నావా ?"

ఇంకోలాగ అతణ్ణి పిలవలేకపోయిందామె. ఇవానా కుడి చేతిని తనచేత్తో అందుకున్నాడు రాబర్టు. వేడిగా వుంది అతడి చెయ్యి: దృఢంగానూవుంది. ఇవానాకి చిరపరిచితమైంది ఆ చెయ్యి.

"ఇవా, — ఇప్పుడూ ఇవాఅనే పిలవవచ్చా నేను ? అన్నాడు రాబర్టు.

"ఎందుకు కూడదు ?"

ఇవానా హృదయంలో ఏదో బాధ రేకెత్తినట్టయింది.

"ఒక సంవత్సరమవుతుంది. ఈవూళ్ళోనే వున్నాను. ఇన్నాళ్ళకి నువ్వు కనిపించావు."

చిన్న చిరునవ్వుతో మనస్సులోని భావం మరుగు పరుస్తూ అన్నాడు రాబర్టు.

"నిజమే. పార్టీలూ, కేసులూ — వీటితోనువ్వు పట్నం తూర్పు దిక్కువుంటున్నావు. నేను మా ఆయనతో పడమటి దిక్కువుంటున్నాను. అంచేత ..."

చిరునవ్వుతోనే జవాబు చెప్పింది ఇవానా.

నవ్వులూ వాటితో ఇలాగే సాగింది సంభాషణ.

"రాబ్, మొదట నిన్ను పోల్చుకోనే లేకపోయాను, తెలుసా ? అంత మారిపోయావు నువ్వు."

"ఇవా, బైట నాలో మార్పుకనపడుతోంది, నిజమే. కాని, లోపల పిసరంతయినా మారలేదు. నమ్ము."

ఇవానా మొహంమ్మీద దృష్టినిలుపుతూ అన్నాడు రాబర్టు.

కిందికి చూస్తూ నుంచుంది ఇవానా. ఆమె హృదయంలో ఏదో అర్థంకాని ఆనందం నిండి పోతున్నట్టుంది. ఏదో గెలుపు సాధిస్తే కలిగే ఆనందంలాంటి ఆనందమది.

"సాయంకాలాలు ఎటుయినా తిరగడానికి వెళుతుంటావా?"

"ఆఁ, పిల్లల్ని తీసుకుని..."

"ఓహో, సరే. — ఎంతమందేమిటి పిల్లలు?"

ఆశ్చర్యపడ్డట్టు చూస్తూ అడిగాడు రాబర్టు.

"ఒక అబ్బాయీ, వొక అమ్మాయీ." తలవొంచుకునే చెప్పింది ఇవానా.

ఎవరూ మాటాడలేదు కొంత సేపు.

గుర్రబ్బళ్ళు పరుగెత్తుకుపోతున్నాయి.

చిల్లరసామాను లమ్మే వాడు అరుస్తూపోతున్నాడు.

కుర్రాళ్ళు జట్లుజట్లుగా స్కూలు దిక్కు పరుగెడుతున్నారు.

ఈఇద్దరు స్త్రీపురుషులుమాత్రం వొణుకుతూవున్న హృదయాల్తో మాట్లాడకండా అలాగే నుంచున్నారు. ఇద్దరి చూపులూ వాళ్ళ కాళ్ళకింద నేలమీదే లగ్నమైవున్నాయి.

చివరికి ఇవానా అంది "నువ్వేదో విదేశం వెళతావని విన్నాను."

"ఇంకా నిశ్చయం కాలేదు. మొదట వెళదామనే అనుకున్నాను. కాని, ఇవా, వెళ్ళాలని అంతఇదిగా లేదిప్పుడు."

"......................"

"ఇవా, నువ్వు ఎప్పుడయినా స్కేటింగుకి వెళుతుంటావా?"

"అప్పుడప్పుడు వెళుతుంటాను."

"ఇవాళసాయంత్రం వస్తావా? ఇవాళమంచి ఉత్సవం వుందక్కడ. మందుగుండుకూడా కాలుస్తారు. డాన్సు అదీ వుంటుంది. — వస్తావా?"

కళ్ళెత్తి చూడలేకపోయింది ఇవానా.

పురుషుడి కళ్ళలో — పిలుస్తూ మెరిసే మగవాడిచూపుల్ని—దుర్బలమైన స్త్రీహృదయం నిరాకరించడం కష్టం.

"తప్పక వస్తానని చెప్పలేను. నేను......"

తడబడుతూ అంది ఇవానా.

"ఏంచేశ?"

ఆమె మెత్తని చెయ్యి తన చేతిలోకి తీసుకున్నాడతడు.

"ఏం, భయపడుతున్నావా? నామీద నమ్మకం లేదా? ఇవా!"

ఇవానా మాటాడలేదు. ఆమె బుగ్గలమీద ఎరుపు నిగనిగలాడుతోంది.

వణుకుతూవున్న ఆమె మెత్తనిచేతిని మెల్లిమెల్లిగా నొక్కుతూ అన్నాడు రాబర్టు :

“ రావాలి తప్పకుండా రావాలి. ఏం, సాయంకాలం నీకోసం కనిపెట్టుకువుంటాను. ఇవా, — వస్తా. ”

రాబర్టు వెళ్ళిపోయాడు.

ఇవానా హృదయంలో వొక గొప్ప ఆకర్షణావేసి వెళ్ళాడతడు. ఆపుకుందికి అసాధ్యమైంది. ఆ ఆకర్షణ.

గదిలో నిలువుటద్దంముందు ముస్తాబు చేసుకుంటూవుంది ఇవానా.

ఆమె మనస్సు మనస్సులో లేదు.

ఒకకొత్తజీవనం ఆమెముందు తలుపులు తీసుకుని పిలుస్తున్నట్టుంది.

ఇన్నాళ్ళ బతుకులో ఆమె అనుభవించిం దేముంది ? — నిరాదరణా, ఈసడింపూ, అవమానమున్నూ.

తనభర్త ఇంట్లో ఆమె వొక నమ్మకమయిన నౌకరు. అంతే. అంతకంటే ఆమె జీవితంలో ఆమె పొందిన ఆధిక్యత ఏముంది ?

ఆమె జీవితంలో ఆనందంలేదు ; అనుభవంలేదు ; ఉత్సాహంలేదు. ఉన్నదల్లా ఉత్సాహంలేని అరవచాకిరి.

మిగిలిన యవ్వనంతో అందంగా వున్న ఆమె శరీరం వొంపులు నిలువుటద్దంలో చూసుకుందామె.

ఇవాళ సాయంకాలంకోసం ఆమెహృదయం దాహంతో వున్నట్టుంది.

ఇవాళ తన జీవితంలో సౌఖ్యం అనుభవిస్తుం దామె.

ఇందులో తప్పేముంది ?

పాపమేముంది ?

ఇద్దరూ ఏకాంతంగా కూచుంటారు.

కష్టమూ సుఖమూ మాట్లాడుకుంటారు.

కొంచెపు డ్యాన్సు చేస్తారు.

ఇందులో తప్పేముంది ?

పాపమేముంది ? అపరాధంమాత్రమేముంది ?

సంతోషంలేని తన నీరసజీవితం కొంచెం రసవంతం చేసుకోవాలనే ఆమె అభిలాష.

మొరడుబారిపోయిన బతుకులో కొంచెం పచ్చదనం తేవాలనే ఆకాంక్ష.

ముస్తాబు పూర్తయింది.

పైన వోవరుకోటు వేసుకుంది.

వీపు మీద స్కార్ఫు తగిలించుకుంది.

మళ్ళీ వోసారి అద్దంలో చూసుకుని జుత్తు సరిచేసుకుంది.

పౌడరు పఫ్ మరోసారి బుగ్గలికి రాసుకుంది.

చేతిరుమాలుమీద మరోసారి అత్తరు పులుముకుంది.

ఇక బయలుదేరడమే తరవాయి.

బయట పిల్లలు కేకలు.

హటాత్తుగా తలుపు తెరుచుకుంది.

పరుగెడుతూ ఉడీ గదిలో ప్రవేశించాడు.

ఇవానా మొదటి బంగారుపాప ఫేడీ.

"ఇక్కడా వున్నావు? అమ్మా, ఎక్కడికో వెళుతున్నావా?"

"అవునురా, ఫేడీ!"

కొడుకుని తేరిపార చూసింది ఇవానా. అందమూ, అమాయకత్వమూ, ప్రకాశమూ కుర్రాడి మొహంలో తొణికిసలాడుతున్నాయి.

"ఏం రా, ఇంత సేపూ నువ్వు ఆడుతూనే వున్నావూ?"

"ఊఁ, కాని అమ్మా, విన్నావుటే, ఇవాళా హైరీని అందరూ ఏడిపించి వొదిలిపెట్టారే. హైరీ నీకు తెలుసా? తెలీదూ? ఆదొడ్డిలో వుంటాడూ! —

ఇవానా హైరీని ఎరుగును. అతడి తల్లినీ ఎరుగును. సంవత్సరం కావస్తుంది, మొగుణ్ణీ, కొడుకునీ వొదిలేసి ఎవరో పాత స్నేహితుడితో లేచిపోయిం దామె.

"ఇవాళ మళ్ళీ హైరీని ఏడిపించారమ్మా! వాళ్ళ అమ్మని నానామాటలూ అని, వాణ్ణి వుడికించి వుడికించి చంపారు" అన్నాడు ఫేడీ.

"వాళ్ళంతా చెడ్డకుర్రాళ్ళు. వాళ్ళతో నువ్వు జట్టుకూడకు"

ఇవానా కంఠం వొణకడం ప్రారంభించింది.

"నన్ను వాళ్ళేమీ అనరే. నువ్వు వాళ్ళకి జెల్లమూ అదీ పెడతావు కదూ! అంచేత నిన్ను వాళ్ళు ఎంతో ఇదిగా చూస్తారు."

చప్పున కొడుకుని గుండెలికి అద్దుకుంది ఇవానా. ముద్దుల్తో అతడి మొహం ముంచెత్తింది.

ఒక్క క్షణం గడిచింది.

"నువ్వ ఎక్కడికో వెడతావుటే, అమ్మా!" అన్నాడు టేడీ.

"ఊఁహూఁ, ఎక్కడికీ వెళ్ళను."

ఓవరు కోటు తీసేసింది ఇవానా.

ఆమె మొహం పాలిపోయింది. పల్చటి పెదవులుబిగించి, ఆమె ఏదో దృఢనిశ్చయానికి వచ్చినట్టు కనిపిస్తోంది. హృదయంలో ఏదో మహాయుద్ధం ముగిసినట్టుంది. శరీరం యావత్తూ సడిలిపోయి నట్టయింది.

టేడీ కిలకిలమంటూ సంతోషంగా అన్నాడు :

"ఎక్కడికీ వెళ్ళవు కదుటే, అమ్మా! అయితే మాంచి బావుందే. ఒరేయి అమ్మా, ఆరాజుకూతురు కథ రాత్రికి పూర్తి చెయ్యాలి మరి! ఏమూని పిల్చుకురానా? ఇప్పుడే చెప్తావా? పెద్దకథకదూ మరి!"

సోఫామీద చదికిల బడింది ఇవానా.

"వెళ్ళు, ఏమూని పిల్చుకురా."

గదిలోంచి బైటికి పరిగెత్తాడు టేడీ. గబగబా వేస్తున్న అతడి అడుగులకేసి ప్రేమనేత్రాల్తో చూసింది ఇవానా.

ఏదో అర్థంకాని ఆత్మతృప్తితో ఆమె మొహం తళతళా ప్రకాశించింది.

---

# మోతీ

"ఆబెల్టు ఎంత ?"

దుకాణదారుణ్ణి ధరఅడిగిం దామె.

పాతగుడ్డపీలికలు కట్టిన ధూళి దులిపే కర్ర బెల్టు దిక్కు చూపిస్తూ దుకాణందారు అడిగాడు — "ఇదా ?"

"ఉఁహూఁ — అంది."

మరో బెల్టు చూపించా డతడు.

"అదికాదు — దానిమీదిది.

ఆమెకి నచ్చిన ఆబెల్టుదిక్కు దుకాణందారు కర్ర చూప గానే ఆమె అంది—"ఆఁ, అదే—దానిధర ఎంత ?"

"పన్నెండణాలు."

చాలా హెచ్చనిపించిం దామెకి. అయినా పూరికే కను క్కుందా మని మళ్ళీ అడిగింది.

"ఎంతా ?"

"పన్నెండణాలు."

తన చిన్నిచిట్టివేళ్ళని ఉపయోగించి లెక్కపెట్టడం మొదలు పెట్టిం దామె — "ఒకటీ, రెండూ, మూడూ..."

ప్రయిమరీస్కూల్లో రెండోతరగతి చదువుతూవున్న చిన్న అమ్మాయి ఆమె. కానీ అర్ధణా తప్ప ఎన్నడూ హెచ్చు డబ్బులు ఆమె చేతిలోకి వచ్చిన పాపానపోలేదు. బళ్ళో లెక్కలూ అవీ నేర్చుకుంది — అరవై నాలుగుకానులు, పద

హారుఅణాలు వొకరూపాయి. ఇవన్నీ ఆమెకి జ్ఞాపకము న్నాయి. కాని, లోకవ్యవహారంలో వుండే రాగిడబ్బులుతో ఆమెకి ఏమాత్రమూ సంబంధమే లేదామె. అంచేత పన్నెండు అణాలుఅనేసరికి ఆమె గుండెల్లో దడదడలాడింది.

బడికి వెళ్ళేటప్పుడూ, బడినించి వచ్చేటప్పుడూ ఎన్నోసార్లు ఆమె ఆబెల్టు చూసివుంటుంది. ఆమె సాటివయస్సు పిల్లలు ఎంతోమంది ఆదుకాణంమీాద చాక్లెట్లో, పిప్పరమెంటుబిళ్ళలో, కాగితాలో, రబ్బరో, కలమో, పెన్సిలో – ఏదో వొకటి కొంటూ వుంటారు. అప్పుడప్పుడు వాళ్ళతోకూడా ఆమె వెళ్తుంది. ఐతే, ఆమె దృష్టంతా వొక్క ఆబెల్టుమీాదే వుండేది. నిజంగా ఆబెల్టంటే ఆమెకి మహాఇది.

ఎన్నోమాట్లు దాన్ని చూసివుంటుందామె. ఎన్నోమార్లు ధర అడిగివుంటుంది. ఎన్నోసార్లు దుకాణందారు ఆమెని కసిరీవుంటాడు. తానేమో తన వ్యాపారమేమో చూసు కోవలిసినవాడు దుకాణందారు. ఈపిల్లసరదా అతడికేం పడుతుంది? ఇంతవరకూ వొక దమ్మిడీ వస్తువు కొన్న పాపాన పోలేదామె. కాగితమూ, పెన్సలూ, రబ్బరూ, కలమూ ఏదీ కొనలేదు. ఇవన్నీ ఇంటిదగ్గిరే దొరికేవామెకి. అంచేత ఆమె ఏవస్తువా ఎన్నడూ కొనేది కాదు. ఊరికే ధరఅడు గుతూవుంటే దుకాణందారు చిరాకుపడడూ! అతడు కసురు తున్నా, చిరాకుపడుతున్నా కుక్క బెల్టుమీాద వున్న వ్యామో హంమాత్రం వొదులుకోలేదు, అమ్మాయి.

బడికి వచ్చేటపుడూ, ఇంటికి వెళ్ళేటపుడూ బెల్టుని చూస్తేనే కాని ఆమెకి తోచేదికాదు. నిజానికి ఎంతో అందంగావుంది బెల్టు. చర్మం మెత్తగానూ, మంచిపనితనంగానూ వుంది. చిన్న చిన్న నాలుగు మువ్వలూవున్నాయి దానికి. ఎంతో బాగా మోగుతాయవి. అందంగావున్న అట్టకి తగిలించి వుందది. అంచేత మరీబాగా అవుపిస్తోంది. గాలికి కదిల్తే చాలు, అదిమెరుస్తుంది. గిల్లుగిల్లుమంటాయి మువ్వలు; సన్నని ధ్వనిచేస్తాయి. అదంతా చూస్తే అమ్మాయి ఆనందం హద్దూపద్దూ వుండేదికాదు.

బెల్టుచూడడమన్నా, తనజట్టు అమ్మాయిలికి చూపించడమన్నా వెర్రిసరదా ఆమెకి. ఏమయినాసరే, అది కొనితీరాలి. ఈవాంఛ గాఢంగా ఆమెలో స్థిరపడిపోయింది. అంతా బాగానేవుంది. కాని, డబ్బులేవీ ? పన్నెండుఅణాలు ఎలా కూడబెట్టడం ?

ఏదో కొనుక్కు తినమని వాళ్ళ అమ్మ అడపాదడపా కానీ పరకా ఇచ్చేది. అలాఅని రోజూ అడిగితేమాత్రం కొప్పడేది. "రోజూ చిల్లరతిళ్ళు కావాలినీకు ! కానీలేదూ గీనీలేదూ, వెళ్ళూ, తిన్నగాబరికి" అంటూ గదమాయించి పంపేసేది.

అయినా బెల్టుచూడడం గుటకలుమింగడం మానలేదామె. దానికోసం ఆకలితోవుండయినా సరే, కానీ, అర్ధణా కూడబెడుతూవుండేది. ఇలా మెల్లిగా నాలుగణాలవరకూ కూడ

బెట్టింది. ఎన్నోసార్లు అవి లెక్కబెట్టింది. మళ్ళీమళ్ళీలెక్క పెట్టింది. నాలుగణాలు — పదహారు కానులు—పావలా-ఇంతే, ఇంకా ఎనిమిదిఅణాలు కూడబెట్టాలీ? సరిగ్గా రెండింతలు! ఎలాగ? ఎక్కడనించి తేవడం?

ఏరోజయితే నాలుగణాలూ ఆమె కూడబెట్టిందో, ఆరోజు బడినించి వచ్చేటప్పుడు దుకాణందారుతో చెప్పిందామె.

"ఏంగా, ఇదిగో, ఆబెల్టు ఎవ్వరికీ ఇచ్చెయ్యకు. నేను కొనేస్తాను."

"ఛా పో"— అంటూ గుడ్డలుకట్టిన కర్రతో బీరువాలు దులపడం మొదలెట్టాడు దుకాణందారు. ఆమెమాత్రం రోడ్డుమీదించి రెప్ప వెయ్యకండా కుక్కబెల్టు చూస్తూ నుంచుంది.

కొన్నాళ్ళయాక, ఆమె పింతల్లి వాళ్ళయింటికి వచ్చింది. ఆమెవెళ్ళిపోయినప్పుడు, అక్కకూతుర్ని ఎత్తుకుని ముద్దుపెట్టుకుంది. అర్ధరూపాయి ఆమెచేతిలో పెట్టింది. ఎన్నోదినాల అభిలాష అకస్మాత్తుగా ఫలించింది. పింతల్లి వెళ్ళిపోయాక పరిగెడుతూ వెళ్ళి తన పుస్తకాలసంచీ విప్పింది. అందు లోంచి పాత సిగరెట్టుపెట్టె పైకితీసింది. కింద టఫీ మని చదికిలబడింది. పరికిణీకింద పరిచింది. తన పెన్నిధి యావత్తూ కుప్పపోసింది. ఒక్కొక్కపైసా లెక్కపెట్టడంమొద లెట్టింది. లెక్కపూర్తయాక, పిన్ని యిచ్చిన అర్ధరూపాయీ

దాంతో కలిపింది. మెరశిమొత్తం పన్నెండణాల ముక్కాలనీ అయింది. ఆమె పెన్నిధి అంతా అంతే.

ఆమె కోరింది ఇలా హటాత్తుగా దొరికి పోయింది. ఆమె ఆనందానికి అంతమేలేకపోయింది. అవాళబళ్ళో పాఠాల మీాద పిసరంతయినా మనస్సు నిలవలేదు. బడివొదిలేగంట దిక్కేవున్నాయి ఆమెచెవులు. చివరిగంట మోగడమే తడువు. పుస్తకాలసంచీ మెళ్ళో వేసుకుని టపీమని నుంచుంది.

ఒక్కపరుగుని దుకాణం దగ్గిరికి వెళ్ళింది. ఉన్నచోటో భద్రంగా వుంది బెల్టు. బ్రహ్మానందం అయిపోయిందామెకి. సిగరెట్టుపెట్టెలోంచి డబ్బులుతీసి, దుకాణదారుముందు పోసిందామె. అట్టనించి తీసి బెల్టు ఆమె చేతిలో పెట్టాడు దుకాణదారు.

కుక్కబెల్టు ఆమెచేతిలో వుందిపుడు. మెల్లిమెల్లిగా వ్రాపుతూ దాన్నిపట్టుకుందామె. మువ్వలు గిల్లుగిల్లుమంటూ, ఎంచక్కా మోగుతున్నాయి. చెప్పశక్యం కాకుండా వుంది ఆమెసంతోషం. పాలుపొంగినట్టు వుప్పొంగిపోతోంది.

బెల్టుకొన్నాక కూడా ఆమెదగ్గిర మూడుకానులు మిగిలాయి. మూడుకానులూపెట్టి చిన్నచిన్న బిస్కత్తులు కొందామె. అయితే అందులో వొకటీ ఆమె రుచిచూడలేదు.

ఇళ నామోతీ కొత్తబెల్టుపెట్టుకుంటుంది. ఈభావనతో ఆమె గెంతులేస్తూ గబగబా ఆమె ఇంటిదిక్కు నడుస్తోంది. మోతీ అంటే ఆమెకి ప్రాణం. చిన్నపిల్లప్పటి

నించీ మోతీని—అదిఅన్నం తినలేనప్పటినించీ—పాలుపట్టి దాన్ని పెంచిం దామె. ఆమే దాన్ని పెద్దదాన్ని చేసింది. ఇప్పు డది పెద్దదయింది అయినా అది ఆమె దగ్గిర పెద్దదికాదు, పిల్లే.

నిజంగా మోతీ అంటే ప్రాణంకంటె అధికం ఆమెకి. సర్వ ప్రపంచమూ వొక్క-మోతీయే ఆమెకి. ఆమె గదిముందు గడపమీద ఆమె ఆటవస్తువులు యావత్తూ పడివుంటాయి. రంగురంగుల గుడ్డపీలికలూ, గాజుముక్కలూ, చిన్న టీసెట్టూ, చిన్నమంచమూ, చిన్నచిన్నగిన్నెలూ, ముంతలూ— అన్నీ అక్కడే పడివుంటాయి. పరసలో, వెంట్రుకలున్న రబ్బరు కుక్కపిల్లా తెచ్చిం దామె, మోతీ ఆడుకుందికి. తలమీద నొక్కితే కూఁ, కూఁ అని అరుస్తుం దది. ఇందాక కొన్న మూడుకానుల బిస్కత్తులూ మోతీ, ఆమె కలిసి తినాలి. అందుకనే వొకటన్నా నోట్లో వేసుకోకండా ఇంటికి పట్టుకు వచ్చిందామె.

మోతీ చాలా మంచికుక్క. ఆ అమ్మాయిమీద అమిత మైన ప్రేమ దానికి. అమ్మాయిమీద తప్పించి మరెవ్వరి మీదా అంత ప్రేమలేదు దానికి. ఆమెని చూస్తేచాలు, దాని తోక ఆడుతుంది. చెవులు కిందికీ మీదికీ వూగుతాయి. దాని ఆటా, పరుగూ, గెంతులూ — వో, పట్టపగ్గా లుండవు.

బెల్టుపట్టుకుని వొక్క పరుగుని ఇంటికి వచ్చిం దామె. వాకిట్లో ద్వారందగ్గిరికి వచ్చిందో లేదో, పిలవడం మొద లెట్టింది —

"మోతీ! మోతీ! — మోతీ!!"

— ఇదేమిటి? ఇవాళ తన పిలుపుకి జవాబు లేదేమిటి?

దొడ్లో, గడపమీద, నట్టింట్లో, పెరట్లో, రెండో అంతస్థు మీద — వాకట్లో — అన్ని చోట్లా వెదికిందామె. అన్ని చోట్లా పిలిచింది.

"మోతీ! మోతీ! — మోతీ!!"

వెదికి వెదికి అలిసి పోయిందామె. ఎక్కడా కనపళ్ళేదు మోతీ.

ఎన్నో సార్లు గడపమీద ఎప్పుడూ మోతీ వుండే చోటు తొంగిచూసిందామె. ఉదయం అక్కడ వొదిలి వెళ్ళిన తుండుగుడ్డ తప్ప మరేదీ కనపళ్ళే దక్కడ. అవాళ తెల తెల వారగానే మోతీని చూసిందామె. ఎంతో లాలించింది దాన్ని; ముద్దులాడింది. బాగా వొళ్ళంతా తోమి స్నానం చేయించింది. తాను మొహంతుడుచుకొనే తువ్వాలుతోనే దాన్ని తుడిచి. శుభ్రంచేసింది. రెండుచేతుల్తోనూ దాన్ని పట్టుకుని లాలించింది. ప్రేమగా ఎంతోసేపు దాంతో వూసు లాడింది. సరిగ్గా దాని మొహంమీద మొహంపెట్టి అంది; "నీకోసం మాంచి అందమైన బెల్టువేస్తాను. ఏం, మరి—మరి చిన్న బిస్కత్తులు, తియ్యటి బిస్కత్తులూ తెస్తాను. ఆఁ, వీటితో మనంఇద్దరమూ ఇవాళ మజాచేద్దాం. తెలిసిందా! మోతీ!"

ఉదయాన్నే అరుగుమీదకూచుని కుక్కని ఆమె ఎంత ప్రేమగా లాలించింది! ఆమె దిక్కు అదంతా చూడడానికి

ఇంట్లోవాళ్ళకి తీరుబడే లేదు. వాళ్ళంతా ఏదో మరో పని మీద నిమగ్నమై వున్నారు. ఆమె తండ్రి పై అధికారి "దొర గారు" అవాళే మరోవూరు వెళ్ళిపోతున్నారు. ఆయనికి బదిలీ అయిపోయింది. అందుకని ఆయనికి టీపార్టీ ఇస్తు న్నారు. ఆసందడిలో ఇంటిల్లిపాదికీ తీరికే లేదు.

సాయంకాలం ఆ అమ్మాయి బడినించి ఇంటికి వచ్చేసరికి దొరగారు టీ పుచ్చుకుని వెళ్ళిపోయారు. ఆయన్ని రైలుకి దిగబెట్టి ఆమెతండ్రి ఇప్పుడే ఇంటికి వచ్చాడు.

ఎక్కడా మోతీ కనపడకపోవడంతోటే, ఆమె ఏడవడం మొదలెట్టింది. ఆమెని బుదిరించడం కోసం ఎంతో ప్రయాస పడింది తల్లి. ఎంతో నచ్చజెప్పింది. మరోకుక్కపిల్ల అంత కంటేనుంచిది తెచ్చిపెడతానని ఆశపెట్టాడు తండ్రి. లాభం లేకపోయింది. ఆమె కన్నీళ్ళు కట్టిపెట్టలేదు.

"మోతీ, మోతీ"

పెదవులు మోతీ అనడం మానలేదు. చివరికి చిరాకు వేసింది తండ్రికి. కొట్టాడు కూడా ఆమెని. ఉఁ హూఁ. "మోతీ, మోతీ" పెదవులు మోతీ అనడం మానలేదు.

ఆమె నవ్వులూ, కేరింతలూ మంటగలిసి పోయాయి. దేని మీదికీ ఆమె మనస్సు పోలేదు. రాత్రినిద్రలోనూ ఆమె పలవరిస్తూనే వుంది— "మోతీ, అందంగా వుందికదూ బెల్టు! నీకు నచ్చిందా ? ఏం, నచ్చిందా !"

ఆమె మోతీ ఏమయిందో ? ఏమో ?

ఆమెని సంతోషంగా వుంచడంకోసం చేసిన ప్రయత్నాలన్నీ వ్యర్థమే అయిపోయాయి. మరో కొత్తకుక్కపిల్లా తెచ్చారు కాని, దానిదిక్కు కళ్ళెత్తి చూడనైనా చూడలేదామె. ఆమె ఆరోగ్యం చెడింది. జబ్బు చేసింది. రోజూ జబ్బుతో ఆమె చిక్కిపోవడం మొదలెట్టింది.

ఎందరో డాక్టర్లు వచ్చారు. ఎన్నో మందులూ ఇచ్చారు. ఆమె ఉల్లాసంగా వుండడంకోసం ఎన్నో ప్రయత్నాలు చేశారు కొత్తకొత్త మందులు పోశారు. ప్చ్! దేనివల్లా ప్రయోజనంలేక పోయింది. రాను రాను చావు దిక్కే దారి తీస్తున్నట్టుం దామె.

బదిలీ అయిన దొరగారి సిఫార్సువల్ల ఆమె తండ్రికి ప్రమోషను దొరికింది. జీతం హెచ్చయింది. హెచ్చుజీతం మొదటిసారి అందుకుని అతడు ఇంటికి వచ్చాడు. అవాళ ఆమె జబ్బు లక్షణం ఏమీ బావుండలేదు. గడియో క్షణమో అన్నట్టుంది.

బల్లమీద అతడికోసం వొక ఉత్తరం కనిపెట్టుకుని వుంది. అతడికి ప్రమోషనుకోసం సిఫార్సుచేసిన దొరగారు రాసిన ఉత్తర మది. దొరగారి అక్షరాలు కవరుమీద చూడగానే, చప్పున ఉత్తరం చించా డతడు. కుశలప్రశ్నలూ, పయిభోగట్టాలూ అయాక, ఉత్తరం చివరిభాగం ఇలా వుంది:

"......దాని అందం చూసి, ఎంతో ప్రేమతో ఆకుక్కమీదగ్గిరించి పట్టుకు వచ్చాను. అయితే తొలినించీ అదే అరవడంతో మాప్రాణాలు తీసిం దది. ఇక్కడి మా డబల్

రొట్టే అదీ దానికి నచ్చలేదో ఏమో, తిండీ గిండీ పూర్తిగా మానేసింది. ఇలాంటి వాకటోరకం తిండి దానికి అలవాటు లేదన్న మాట! కాళ్ళమీద తల దాచుకుని వో మూల అదే పడుకోవడం, ఎవరన్నా దగ్గిరికి వెళితే అమాంతంగా కల బడడం — ఈ వెధవగుణం పట్టుకుంది దానికి. పిల్లా జెల్లా వున్న ఇంట్లో ఇలాంటి కాట్ల కుక్కని వుంచడం ప్రమాదం కూడాన్ను. అందుకని, దాన్ని వొదిలిపెట్టేశాం. వొదిలిపెట్టే శాక, అది బైట తిరిగితిరిగి నిన్న చచ్చిపోయిందని ఇప్పు డిప్పుడే తెలిసింది......"

ఉత్తరం చదవడం పూర్తయాక అతడి చూపు పక్క మీద పడివున్న కూతురిమీద పడింది. ఆమె దేహంలో వూపిరే లేనట్టుంది. కళ్ళరెప్పలు మీదికెత్తడానికే ఆమెకి శక్తి లేకండా వుంది. ఇంత నీరసంగా వున్నా, కుక్క బెల్టు మాత్రం ఆమె చేత్తో బిగించి పట్టుకునే వుంది. ఏదో చెప్పా లని ప్రయత్నం కాబోలు — ఆమె పెదవులు కదుల్తున్నాయి. పరిగెత్తుకు వెళ్ళాడు తండ్రి. ఆమె పెదవుల దగ్గిర చెవిపెట్టాడు.

"మో — తీ — మో — తీ"

చాలా క్షీణస్వరం వినగలిగాడతడు. అదీ నిజంగా అతడు విన్నాడో, అతడి భ్రమో — చెప్పడం కష్టం.

---

*

# తల

టర్నరు ద్వీపకల్పం వెనక లేగూన్‌నది వొక సరస్సులా తయారైంది. అక్కడ వొక గ్రామం వుంది. గ్రామం చుట్టూ తేమగానూ బురదగానూ వుంటుంది. అక్కడే పోలాకుదొరకి పోర్రాహా మనిషితో కలహం వచ్చింది. స్త్రీల శరీరసౌష్ఠవానికి ప్రసిద్ధి చెందింది ఆప్రదేశం. వాళ్ళ రక్తంలో యూరోపియను రక్తం కూడా కలిసి వుంది. (బానిసలని అమ్మే ఇంగ్లీషు వాళ్ళ ప్రసాద మది. అని వాస్కోడిగామా కాలం నించీ వస్తోంది. బహుశా పోర్రాహా మనుష్యుల్లో ఏమాత్రం కేకేసియను రక్తం కూడా కలిసి వుండాలి. (ఈ రక్తసంకరం మూలంగా సీర్‌బోర్‌రో ద్వీపంమీద వుండే నరభక్షకుల్లో, ఈనాటి మనవాళ్ళ కొందరి దూరబంధువులూ వుంటారన్న విచిత్రభావానికి అవకాశం లేకపోలేదు.) ఏమయినా అనుకోండి, తక్కువజాతి తుంటర్లు కావేషీ తీర్చుకునే విధంగా ఆ సమయంలో పోర్రాహామనిషి ఆస్త్రీ గుండెల్లో బాకు పొడిచేశాడు. పోలాకు మీదకూడా కలబడ్డాడు వాడు. అయితే పోలాకు తన రివాల్వరుతో వాణ్ణి అడ్డుకున్నాడు. దాంతో వాడి బాకు పోలాకు గుండెలమీదికి రాకండా, చప్పుడు చేస్తూ దూరంగా వెళ్ళి పడింది. గుండేమో వాడి చేతిమీద తగిలింది.

పోలాకు మళ్ళీ రివాల్వరు కాల్చాడు. కాని గురి తప్పి పోయింది. పాకలో వొక కిటికీ మాత్రం పగిలి పోయింది.

మీాదికెత్తిన చేతికిందినించి చూస్తూ పోగ్రాహామనిషి ద్వారం దగ్గిర ఆగిపోయాడు. బైటి వెలుతురుకేసి చూశాడు పోలాకు. తన ఎదురుగుండా పోగ్రాహామనిషి మొహం ఎండలో మెరుస్తూ అవుపించింది. జరిగిన దీనంతటికీ ఆవేగంతో వాణికి పోతూ పోలాకు వాక్కడే ఇంగ్లీషుపాకలో వుండిపోయాడు. అదంతా ఎంత వేగం జరిగిపోయిందంటే, దానిగురించి చదవాలన్నా అంత రెండింతలు సమయం తీసుకుంటుంది.

స్త్రీ శరీరంలో ఏమాత్రమూ ప్రాణం లేదు. అది గ్రహించేసి, ద్వారందాకా వచ్చాడు పోలాకు. బైట నాలుగు దిక్కులూ చూశాడు. ఎండలో ప్రతీదీ మెరుస్తూవుంది. యాత్రాదళంలోని కూలీలు అయిదారుగురు పాకలబైట చూస్తున్నారు. తుపాకీ పేలవలసిన అవసరం ఏమివచ్చిందో అర్థంకాక నిచ్చేరపోయి చూస్తున్నారు వాళ్లు. నది వరదల్లో కొట్టుకువచ్చిన నల్లటి వొండు కూలీలవెనక మైదానంలా వుంది. నదివొడ్డున పెరిగిన మామిడితోట మసక మసకగా అవుపిస్తోంది. ఊళ్లో అలజడి కాని, సందడి కాని ఏమీా వున్నట్టులేదు. ఊరి ఆవరణప్రాకారం గోడలు కొంచెం కొంచెంగా అవుపిస్తున్నాయి.

భద్రంగా పాకలోంచి బైటికివచ్చాడు పోలాకు. నది వొడ్డుకి వెళ్లాడు. మాటిమాటికీ వెనక్కి తిరిగి చూస్తున్నాడతడు. పోగ్రాహామనిషి పత్తాలేదు. పెద్ద పొరపాటే చేశాననుకుంటున్నాడు పోలాకు. జరిగిపోయినదానికోసం విచారిస్తు

న్నాడు. అన్నింటికంటే చిక్కేమిటంటే, జరిగిందంతా రహస్యం లేకుండా వాటరుహావుసుతో చెప్పాలి. వాటరుహావుసు చాలా జాగ్రత్తమనిషి. ప్రవర్తన సరిగా వుండాలనే వ్యక్తి. చాలా స్థిరమయిన స్వభావ మున్నాడిది. పోలాకు తనని తాను నిందించుకోవడం ప్రారంభించాడు. తన అదృష్టాన్ని తిట్టుకున్నాడు. వాటరుహావుసుని చెడామడా తిట్టాడు. (ఏమంటే తనకి తెలుసు. ఇదంతా బ్రహ్మాండం చేస్తాడు వాటరుహావుసు.) తానిప్పుడు చిక్కుకున్న ఈ ఆఫ్రికా పడమటి కోస్తానీ నోటికివచ్చినట్టు నిందించాడు. యాత్రావేళంతో అతడు విసుగెత్తిపోయాడిప్పుడు. దీనంతటివెనకా పోర్రాహా మనిషిని ఎక్కడ వెదకడమా అనిన్ని వ్రాగులాడుతోంది మనస్సు.

చెప్పాలంటే ఇదనిపిస్తుంది,—ఇప్పుడు జరిగిన ఈహత్య చీమ కుట్టినట్టయినా లేదు పోలాకుకి. గడిచిన మూడు నెల్లనించీ ఎన్నో అన్ని ఘోరాలు చూస్తూ వచ్చాడతను. చచ్చిపోయిన ఆడవాళ్ళూ, కాలి బుగ్గయిపోయిన వూళ్ళూ, దిక్కులేకుండా పడివున్న శవాలూ ఎన్నో చూశాడు. క్వ్రాం నదీతీరంలో 'సోఫా' గుర్రపుదళం అడుగు పెట్టినచోటల్లా చూశాడు. తన సున్నితభావాలు మోటుదేరిపోయాయి. ఇప్పుడతని బాధిస్తున్నదల్లా తన స్వంతవిషయమే. ఏమంటే, పోర్రాహా మనిషితో రగడ రావడం తనమీదికి ఆపద వచ్చి పడడమే అని తనకి బాగా తెలుసు.

ఒక నీగ్రో నౌకరు అతణ్ణెదో అడిగాడు. చిరాకుగా వాణ్ణి కసిరాడు పోలాకు. హెడ్మాష్టరుగారి గదిలోకి దూరే బడి కుర్రాడిలాగ, నారింజచెట్లమధ్యవున్న గుడారంలోకి వెళ్లాడతను. అందులోనే వాటరుహౌసు పడుకుని వున్నాడు.

జ్వరం వచ్చి మందు తాగడం వల్ల ఇంతవరకూ నిద్రమత్తుగానే వుందతడికి. అతడి దగ్గిరికి వెళ్లి వొకకాలి పెట్టిమీద చతికిలబడ్డాడు పోలాకు. అతను లేచేవరకూ నిరీక్షించడం మొదలు పెట్టాడు. గుడారమంతటా గిన్నెలూ, ఆయుధాలూ అవీ పడివున్నాయి. మేండీప్రదేశం వారినించి వాటరుహౌసు సంపాదించిన వవి. అవి అన్నీ సులీమా వెళ్లే పడవలమీద పంపించే ప్రయత్నంలో వున్నాడతడు.

కొంచేపయ్యాక వాటరుహౌసు మేలుకున్నాడు. కాళ్లూ చేతులూ చాచుకున్నాడు. ఆరోగ్యం బాగానే వుందనిపించింది. అతడికోసం టీ తయారు చేశాడు పోలాకు. టీ తాగుతూ వుండగా జరిగినకథ చెప్పాడు. ముందు చిన్న ఉపోద్ఘాతం కగిలించి, తరవాత అసలు విషయం చెప్పాడు. పోలాకు అనుకున్నదానికంటే విషయం ప్రమాదకరమైందని గుర్తించాడు వాటరుహౌసు. పోలాకుని నిందించడంతో వూరుకోలేదతడు. కోప్పడ్డాడు. కసిరాడు. పుచ్చిపోయిన మాటలు వేశాడు. "నల్లవాళ్లు మనుష్యులే కాదనుకుంటారు కొందరు. అదిగో అలాంటి మూర్ఖుల్లో వాడివినువ్వు. ఒక్కరోజు జబ్బుపడ్డాను నేను. ఇంతలోనే పీకలమీదికి తెచ్చావు నువ్వు.

ఒక్కన్నెల్లో మూడుమార్లు నీగ్రోవాళ్లతో తగువులాడావు. ఈ మారు బాగానే తింటావు. పోగ్రాహా మనిషంటే ఏమను కున్నావు? ఇంతకిముందు సంపాదించిన కీర్తి చాల్లేదు గామోసు నీనంటి మహానుభావులవల్లే మనజాతి గంగపాలవు తోంది. మళ్లీ పెద్దకుటుంబంలోంచి వచ్చానంటావు! పిళ్లు కసితీర్చుకోందే వొదలరు. నీలాంటిచవటా, దద్దమ్మా, గాడిదా..."

"సరేలెండి. ఆగండి. చాల్లెండి" చీదరించుకుంటూ అన్నాడు పోలాకు.

అలా అంటూంటే మరింతమందుకు వచ్చింది వాటరు హౌసుకి. కూచున్నవాడల్లా నుంచున్నాడు. మరింత గట్టిగా గద్దించడం మొదలెట్టాడు.

"చూడూ, పోలాక్, నువ్వు వెంటనే ఇంటికి వెళ్లిపోవాలి." కోపం పట్టలేకపోతున్నా డతడు. "నాతో మరి వుంచలేను నిన్ను. నీమూలంగా నేను బాగుపడలేను కూడాన్ను......"

"సరే, మరి అధికంగా చెప్పకండి. నేనే వెళ్లిపోవాలని చూస్తున్నాను." వాటరుహౌసు మాటకి అడ్డువస్తూ అన్నాడు పోలాకు.

వాటరుహౌసు తగ్గిపోయాడు. ఒక స్టూలుమీద కూచుంటూ ఇలా అన్నాడు: ఇదిగో పోలాక్, త్వంశుంఠా అంటే త్వంశుంఠా అనిపించుకోవడం ఇష్టం లేదు నాకు. మన ప్రోగ్రాంమంతా నీమూలంగా తల్లకిందులై పోతూ వుంటే

మాత్రం కోపం రాకమానదు. నీతోకూడా సుశీమూదాకా రావడానికి సిద్ధంగా వున్నాను. సరాసరి నిన్ను ఏడమీద ఎక్కించే వస్తాను."

"అక్కర్లేదు. దగ్గిరేకదా! ఒక్కణ్ణే వెళతాను"

"దూరమూ దగ్గిరా అని ప్రశ్నలేదిక్కడ. పోత్రాహా మనిషితో జట్టీఅంటే నీకింకా అర్థమైనట్లులేదు."

"అయితే, ఆమె వాడితాలూకా మనిషని నాకేం తెలుసు?" విసుక్కుంటూ అన్నాడు పోలాకు.

"తెలిసినా మానినా ఆమె వాడిమనిషే," అన్నాడు పోలాకు — "ఏమయినా వాదిలేసిన బాణం మళ్ళించలేవు. ఒక్కడివే వెళ్ళాలనుకుంటున్నావా? ఎంచేత? కొంచెం ఆలోచించిచూడు, నీమీద ఏం వస్తుందో! పోత్రాహా వాళ్ళ చిల్లంగిమంత్రాలే ఇక్కడ శాసనాలని గ్రహించలేకుండా వున్నావు. చిల్లంగేమందు. చిల్లంగే న్యాయం. చిల్లంగే భయం. అదే ఇక్కడ సైన్యాధిపతిని నిర్ణయిస్తుంది. హత్యా జరిగాక, దీనితీర్పు వాళ్ళపక్షమే అయిపోతుంది.

"నీ శత్రువు బహుశా చిల్లంగే ప్రయోగిస్తాడు. అదే ఇక్కడ అంతాను. ఐతే, మనకూలీలు మేండీజాతి వాళ్ళు కావడం కొంత అదృష్టం. ఇక ఇక్కడినించి డేరా ఎత్తి వెయ్యవలసే వస్తుంది. సరే కాని, అప్పుడు నీగురి ఏమై పోయిందంటా? మంట కలిసిపోయిందేం!"

కొంచెపు మాట్లాడకుండా గంభీరం వహించాడతడు. అతడిబుర్రలో లేస్తున్న ఆలోచనలు మంచివికావని స్పష్టంగా చెప్పుతోంది ముఖం. రైఫిలు చేత్తోపట్టుకుని బైటికివేస్తూ అన్నాడు: "నీకు మంచియోగమే వుంటే లోపలేవుండు. నేను కాస్త బైటికివెళ్ళి కథ ఎలా వుందో కనిపెడతాను"

పోలాకు డేరాలోనే ఆలోచిస్తూ వుండిపోయాడు. "నేను గౌరవంగా బతకడంకోసమే పుట్టాను," పొగతాగుతూ అనుకుంటున్నాడతడు — "లండన్లో, పారిస్లో ఎంతవేగం వెళ్ళిపోతే అంతమంచిది."

వాటరుహౌసు మూతపెట్టివుంచిన తాంబ్రేలు పెట్టిమీద అతడిదృష్టి పడింది. విషంలో ముంచిన బాణాలు -- వెదురు పుల్లలు ప్రాడపెరికినవి — భద్రంగా వున్నాయందులో. మేండీ మండలం నుంచి తెచ్చిన వవి.

"గుండెతప్పిపోకుండా ఆవేధనకి గుండుతగిలేవుంటే ఎంత బాగా వుండేది!" తనని తాను నిందించుకుంటూ విసుక్కుంటున్నాడు పోలాకు. (పొద్దుగూకుతోంది.)

చాలసేపటికి వాటరుహౌసు తిరిగివచ్చాడు. ఎన్నో ప్రశ్నలు వేశాడు పోలాకు. అయినా అతడేమీ అధికంగా సమాధానం చెప్పలేదు. ఆ ప్రాహామనిషి మంత్రగాళ్ల జాతికి పెద్ద అని మాత్రం పోలాక్కి బోధపడింది. ఊరు వూరంతా ఈ సంగతే ప్రధానంగా చూస్తున్నారట! అయితే వెంటనే మాత్రం అతడివల్ల ప్రమాదం వుండకపోవచ్చు.

వాడు తప్పక అడివిలోకి పారిపోయివుంటాడు. చిల్లంగివిద్యలో మాత్రం మైరావణుడే వాడు. "ఏదో చేసే ప్రయత్నంలోనే వుంటాడు వాడు" అన్నాడు వాటరుహౌసు. ఈమాట అని మళ్లీ మాట్లాడకండా పూరుకున్నాడు.

"ఏమిటి చేస్తాడు?" కళవళపడుతూ అడిగాడు పోలాకు.

"ఇక్కడినించి పారిపోవాలి నువ్వు. తప్పకండా ఏదో కుంభకోణం జరుగుతూనే వుంది. లేకపోతే ఇంతప్రశాంతంగా వుండదు వ్యవహారం." మళ్లీ మౌనం వహించాడు వాటరుహౌసు. ఆకుంభకోణం ఏమిటో తెలుసుకోవాలని పోలాకు ప్రయత్నం.

"ఏ కొండ పుల్లకేలమీద నాట్యం చేస్తూ వుండవచ్చు వాడు!" అన్నాడు వాటరుహౌసు — "లేదా వనమాలికలు రాగి తప్పేలాలో మరిగిస్తూ వుండవచ్చు." అదేదో బాగా తెలుసుకోవాలని పోలాకు ఆతురత. కాని తాడూ బొంగరం లేని మాటల్తో కాలక్షేపం చేస్తున్నాడు వాటరుహౌసు. ప్రశ్న మీద ప్రశ్న వెయ్యడం మానలేదు పోలాకు. విసుగెత్తిపోయాడు వాటరుహౌసు. పదేపదే పోలాకు ప్రశ్నించాక అతడన్నాడు: "నిన్ను పాకలోనే చంపాలని ప్రయత్నించాడు వాడు. తప్పిపోయింది. ఇప్పుడు ఏదో చిత్రమైన ఉపాయం పన్నుతాడనే తోస్తోంది నాకు. అది త్వరలోనే నీకు తెలుస్తుంది. నిన్ను నేనేదో బెదరగొడుతున్నా ననుకోకు. ఇదంతా వాళ వేళ పిచ్చివూహే కావచ్చు."

"అయితే వాడు ఏం ఉపాయం పన్నుతాడంటారు?"

"చెప్పలేం. నక్కజిత్తుల జాతి వాళ్లది. ఆ ఉపాయాలన్నీ వాళ్లకే తెలుసు. ఆ పాజీ వున్నాడే సగం దొర, మన సేక్స్పియరు—ఆ వెధవ నడుగు. బహుశా ఏమయినా చెపతాడేమో!

పాకవెనక చీకట్లో ఏదో మెరిసింది. ధన్మని చప్పుడూ అయింది. గట్టి మట్టివుండ వొకటి పోలాకు తలకి తగిలీతగల నట్టు పక్కనించి జుయ్యిమని వెళ్లిపోయింది. బైట అగ్గి చుట్టూ కూచున్న నీగ్రోలూ, సగం దొరలూ (యూరేషియనులు) చప్పున నిలబడిపోయారు. ఎవరో చీకటికేసి ఢాం మని తుపాకీ కాల్చారు.

"నువ్వు వొక పాకలోకి వెళ్లిపోతే బావుంటుంది" నెమ్మదిగా అన్నాడు వాటరుహౌసు. పోలాకు రివాల్వరు బైటికి తీసి నుంచున్నాడు. దెబ్బలాడవలిసివస్తే భయపడేరకం కా దతడు. కాని చీకట్లోంచి దొంగచాటుని మీదపడే శత్రువుతో పోట్లాడడం తెలివైన పనికాదు. ఇది బాగా తెలుసు నతనికి. అంచేత వాటరుహౌసు చెప్పిన ప్రకారం డేరాలోకి వెళ్లిపోయి, పక్కమీద శరీరం వాల్చాడు.

ఏదో కోడికునుకు పట్టిం దతడికి. అయితే కలలువచ్చి, పూర్తిమాత్రం కాలేదు నిద్ర. రకరకంగా వచ్చాయికలలు. అన్నిటిలోనూ పోగ్రామాహామనిషి మొహాం మాత్రం తప్పకండా కనిపిస్తూవుంది. పాకలో రివాల్వరు కాల్చినప్పుడు, పారి

పోతూ వాడు వెనక్కి చూశాడే, అదిగో అదే మొహం. చిత్రమేమిటంటే, అతడి మొహం కనిపించినట్టయితే చాలు, పోలాకు బుర్ర గిర్రుమనిపోతోంది. ఏదో బాధగానూ వుంటోంది.

మర్నాడు తెల్లవారింది. ఇంకా చీకటి మసకమసకగా వుంది. పడవలమీద సామానులు వేస్తున్నారు. ఎక్కడి నించో వొక బాణం రివ్వుని వచ్చింది. పోలాకు కాళ్ళముందు భూమిలో గుచ్చుకుని వణకడం ప్రారంభించింది. నీగ్రో నౌకరు చుట్టుపట్ల పొకలూ అనీ వెతికాడు. కాని ఎవ్వరూ కనిపించలేదు.

హంతకుడు చేసిన రెండు ప్రయత్నాలున్నా పార్టీలోని మనుష్యులు పోలాకునించి దూరంగా వుండడం ప్రారంభించారు. పోలాకు మాత్రం తొలిసారిగా నీగ్రోలమధ్య కూచోవాలని కుతూహల పడ్డాడు. హాటరుహోసు వొక పడవ ఎక్కాడు. అతడితో కలిసికూచుని మాట్లాడుకుంటూ ప్రయాణం చెయ్యాలని వుండినా, పోలాకు మరో పడవ ఎక్కక తప్పిందికాదు. పడవ ముందుభాగంలో అతడువొక్కడే కూచోవలసి వచ్చింది. నదిలో పడవ నడిమధ్యనడపాలనీ, వొడ్డు వందగజాల దూరమైనా వుండేట్టు చూడాలనీ పడవనడిపేవాళ్ళని ఎంతో కష్టం మీద వొప్పించాడు, పోలాకు. రైఫిలును సగం దారవేసి దగ్గిర కూచోపెట్టుకున్నాడతడు. దారికడాకా పోగ్రామా జాతి మనుష్యుల విషయం అడుగుతూవచ్చాడు. తప్పించుకునే

మార్గం లేకపోయింది సేక్స్పియరుకి అడిగిందానికల్లా జవాబు చెప్తూనే వచ్చాడతడు.

రోజంతా అలాగే గడిచిపోయింది. వేగూవది వొడ్డం బడే వడివడిగా నడిచింది పడవ. మధ్యమధ్య కూలిపోయిన వృక్షాలు, కొబ్బరితోటలూ, వాటిమీద పాకుతూన్న లతలూ అవుపించేవి. రెండుపక్కలా జీబుగావున్న తోటలూ వుండేవి. ఆ తోటలమీంచి వుండీ వుడికీ అట్లాంటిక్కు మహాసముద్రం కెరటాల ఘోష వినిపించేది. పోర్చుగీసు మనుష్యులు ఎలా చిల్లంగిపెడతారో తన పచ్చిఇంగ్లీషులో మెల్లిమెల్లిగా చెప్తూ వచ్చాడు సేక్స్పియరు. వాళ్ళు వొకటి ప్రయోగించారంటే శత్రువు శుష్కించి శుష్కించి చావవలిసిందే. పీడకలలూ, దెయ్యాలు ప్రయోగిస్తారు వాళ్ళు. ఈసపు కుర్రాళ్ళని నానాబాధలుపెట్టి చంపేశారు. వాళ్ళమనిషితో చెడ్డగా ప్రవర్తించాడని వొక దొర కుర్రాణ్ణి తరిమి తరిమి కొట్టేశారు. ఆకుర్రాడి శవం దొరికింది. ఛిన్నాభిన్నం అయిపోయి, నానాఇదిగానూ వుందది. అదంతా విన్నాడు. పోలాకు. "ఈ అడివిజంతువుల్ని సరిచెయ్యడానికి క్రయిస్తవ మిషనరీలని ఎందుకుపంపరా అని గవర్నమెంటుని నిందించాడు. సాయంకాలానికి పడవలు కాశీసరస్సు చేరుకున్నాయి. మధ్య వొక లంకవుంది. దానిమీద ఇరవై ముప్ఫయి మొసళ్ళు విశ్రాంతి తీసుకుంటున్నాయి. వాటిని రొప్పేసి, అక్కడ డేరాలు వేసుకున్నారు వాళ్ళు.

మర్నాడు అందరూ సులీమా చేరుకున్నారు ; సముద్రం గాలి పీల్చారు. అక్కడ అయిదు రోజులు వుండిపోవలిసి వచ్చింది పోలాకు. ఈలోగా క్రీటవును వెళ్ళిందికి ఎవ్విధమైన సాధనమూ దొరకలేదు. క్రీటవును అక్కడికి దగ్గిరే. అంచేత పోలాక్కి వచ్చే ప్రమాద మేమీ వుండదని భావించాడు వాటరుహౌసు. తన పరివారంతో సహా తిరిగి రెమ్మో వచ్చేశా డతడు. సులీమాలో వొక్కడే వున్నాడు యూరోపియను వర్తకుడు. అతడి పేరు పెరేరా. అతడితో ఈ అయిదురోజులూ బాగా స్నేహం కట్టాడు పోలాకు. ఆ స్నేహం ఎంత అధికమైం దంటే వొకర్ని విడిచి వొకరు వొక నిమిషం వుండలేక పోయే వారు. పెరేరా బుడతకీచు యూదుడు; పొట్టిగా వుంటాడు. కొన్నాళ్ళు లండనులో వున్నా డతడు. అంచేత ఇంగ్లీషువాడైన పోలాకంటే మరింత ఇష్టం కలిగింది.

తొలి రెండు రోజులూ ఏమీ విశేషం లేకండానే గడిచి పోయాయి. చాలా సేపు పేకాటతో గడిచిపోయింది. ఇద్దరికీ 'నేప్' ఆటవచ్చును. అయితే పీగిపోతూ రావడం చేత పోలాకు బాకీ పడిపోయాడు. మర్నాడు సాయంకాలం పోరాహామనిషి అక్కడా హాజరయాడని తెలిసి పోయింది. ఆ తెలియడమూ తెలియ వలసినట్టే తెలిసింది. ఒక ఇనప ముక్క వచ్చి పోలాకు భుజంమీద చుర్రుమనిపించింది. బాగా దూరంనించి గురిపెట్టినట్టుందది. అంచేతే తగలవలసినంత జోరుగామాత్రం తగలలేదు. కాని పోరాహా వచ్చాడన్న

వార్తమాత్రం అది అందించింది. పోలాకు రాత్రంతా కంటి మీద రెప్ప వెయ్యలేదు. మడత మంచంమీద కూచునే గడిపాడు, రివాల్వరు పట్టుకుని. సూర్యుడు ఉదయం యూదు స్నేహితుడితో తన అవస్థ అంతా చెప్పాడు.

పరిస్థితి చాలాప్రమాదకరమైందనేచెప్పాడు పెరేరాకూడా. చిల్లంగీ, మంత్రాలూ వాటివిషయంలో చాలాచాలా తెలుసు నతడికి. "ఇది విశేషించి వ్యక్తిగతమైన క్రోధం తెలిసిందా? బదులు తీర్చుకోవాలన్న కాంక్షే. దానికితోడు నువ్వు తొందరగా దేశం వొదిలి వెళ్ళిపోతున్నావు. అందుకని పోగ్రామాకి కూడా తొందర పట్టుకుంది. నీగ్రోలూ, సగం దొంగనౌకరూ నువ్వేదో లాభం చూపిస్తేగాని పలకరు. మొహం ఎదటికివస్తే పోగ్రామామసిపిని నువ్వు చంపేస్తావనుకో. కాని వాడూ నిన్ను చంపేస్తాడు. వాడు చచ్చాక కూడా వాడి చిల్లంగి పనిచేస్తుంది. నేను మాత్రం చిల్లంగీ, గిల్లంగీ నమ్మను. కేవలం పిచ్చి నమ్మకమే అది. అలాఅని కొట్టి పారెయ్యడానికి వీల్లేదు. ఈప్రాంతం ఎక్కడికన్నా వెళ్ళు — వొక నల్లటి నీగ్రోవాడు తెల్లటి వెన్నెట్లో రాత్రిళ్ళు గంతు లేస్తుంటాడు. పీడకలలు ప్రయోగిస్తాడు — అన్నట్టు నీకు దుస్వప్నాలేవీ రాలేదు కదా!

"కలలా? ఆఁ, వస్తున్నాయి. ఒకే పాడుకల మాటి మాటికీ వస్తుంది. ఆ వెధవ పోగ్రామాగాడి మొహముందే— అదే వెల్లకిలా నవ్వుతూ అవుపిస్తుంది. పాకలోంచి పారిపోయే

టప్పుడు ఆవాళ చూపించినట్టే ఎకిలిపిస్తూ నూపిస్తాడు పళ్ళు. ఆపాము మొహం సరాసరి దగ్గిరికి వచ్చేసినట్టూ, మళ్ళీ దూరంగా వెళ్ళిపోయినట్టూ అవుపిస్తుంది. భయపడవలిసిన కారణమేమీ లేదనుకో. అయినా ఎందేతో పడుకుందికి వెళ్ళేసరికి గుండెలో దడపుడుతుంది. ఒళ్ళంతా ముచ్చెమటలు పోస్తాయి. కలా చిత్రంగానే వుంటుంది. ఇదంతా వొట్టి భ్రాంతే అనుకుంటాను. అయితే ఆభయం వొదిలించుకో లేకపోతున్నాను."

"అంతా పిచ్చికల్పనే కావచ్చు," అన్నాడు పెరేరా— కాని పోగ్రాహా మనుష్యులు పాములు ప్రయోగిస్తారనీ విన్నాను. మా నీగ్రోవాడు చెప్పాడు. నిన్నా, ఇవాళా ఏమీ పాములు కనపళ్ళేదుకదా!"

"కనపడింది, ఒక్కటి మాత్రం చూశాను," అన్నాడు పోలాకు — "ఇవాళ ఉదయమే. నామడతమంచం కింద వుందది. పక్కమీంచి దిగేటపుడు దానిమీదే పడవలిసింది కాలు. కొంచెంలో తప్పిపోయింది. తరవాత చంపేశాం దాన్ని."

"ఆఁ హాఁ!" ఏదో గ్రహించేసినట్టు అన్నాడు పెరేరా— "ఏమో, దానంతట అదే వచ్చిందేమో! సరే, కాని నీకీళ్ళల్లో ఏమయినా నొప్పులు కనిపిస్తున్నాయా?"

"మంచువల్ల కీళ్ళు నొప్పులుగా వున్నా యనుకుంటున్నాను" అన్నాడు పోలాకు.

"బహుశా అదే నిజం కావచ్చు. కాని ఎప్పటినించీ వున్నాయి నొప్పులు?"

పాకలో ఆహత్య జరిగాకే ఈ నొప్పులు ఆరంభమైనట్లు గుర్తుకి వచ్చింద పోలాక్కి.

"పోగ్రాహామనిషి నిన్ను వెంటనే చంపెయ్యడనే అర్థమువుతోంది నాకు. ఈ మంత్రగాళ్లంటే పీడకలలూ అవీ ప్రయోగిస్తూ, తలవెంట్రుకవాసిలో చావు తెపిస్తూ, కీళ్లల్లో నొప్పులు పుట్టిస్తూ — ఇలా నానాహింసలూ పెడతారని వినికిడి. ఎంత బాధపెడతారంటే — ప్రాణాలతో విసిగెత్తిపోతాడు శత్రువు. అయితే ఇవన్నీ వొట్టి కోతలే అనుకుంటాను. పచ్చికోతలు. ఇవేవీ లక్ష్యపెట్టకూడదు నువ్వు. చూద్దాంకదూ, ముందెలా వుంటుందో!" అన్నాడు పెరేరా.

"ముందు నేనేచూడాలి" పెరేరా టేబిలుమీద మాసిపోయిన పేకముక్కలు చూస్తూ, విచారంగా అన్నాడు పోలాకు — "ఈ చిల్లంగి వెధవ నా వెంట పడ్డాడా ప్రతిక్షణం పీకలమీదికి రావడమూ బాగాలేదు. పోగ్రాహాగాడి చిల్లంగి పేకాటలోకూడా అదృష్టం తగలేస్తుం దంటావా" అనుమానంగా పెరేరాని చూస్తూ అన్నాడు చివరిమాట.

"తప్పకండానూ" చప్పున పేక కలుపుతూ అన్నాడు. పెరేరా — "పోగ్రాహామనుష్యులు చాలా చిత్రమైన వాళ్ళు"

అవాళ మడతమంచం మీద రెండు పాములు చంపాడు పోలాకు. గదినిండా ఎర్రచీమలు వున్నట్టూ కనిపెట్టాడు.

దాంతో తప్పనిసరిగా అత డొక మొండిజాతి రౌడీతో సంప్రదించాలని నిశ్చయానికి వచ్చాడు. మొండీరౌడీ పుర్కతో చేసిన చిన్నకత్తి తీసి పోలాక్కి చూపించాడు. దాన్ని చిత్రంగా తిప్పుతూ, అది మెడమీద ఎలాప్రయోగిస్తే, ఎలా తక్షణం మనిషి చచ్చిపోతాడో అభినయించిచూపాడు. వాడు అభినయిస్తూ వుంటే రెండుకాళ్ళూ వణికాయి పోలాక్కి. తన పని రౌడీచేసి పెట్టడానికీ, తలుచెక్కిన జోడుగుళ్ళ తుపాకీ వాడికి బహుమతీ ఇవ్వడానికీ ఖరారు చేశాడు పోలాకు.

సాయంకాలం పెరిగా, పోలాకూ పేకాటలో వున్నారు. మొండీరౌడీ రక్తంచేతుల్తో ఒక గుడ్డమూట పట్టుకుని లోపలికి వచ్చాడు.

“ఇక్కడ కాదు — ఇక్కడ కాదు” గబగబా అన్నాడు పోలాకు.

పనిపూర్తిచేసి, బహుబుతికోసం వచ్చాడు రౌడీ. అంచేత ఎంతగట్టిగా అన్నా కూడా వాణ్ణి అడ్డలేకపోయాడతడు. మొండీ చప్పున మూట విప్పేశాడు. వరికి పట్టుకువచ్చిన పోగ్రాహా మనిషితల టేబిలుమీద పెట్టేశాడు. బంతిలాగ ఒళ్ళమీదాంచి దొర్లిపోయింది తల. కిందపడిపోయింది. పేకముక్కల మీద రక్తం మరకలు పడ్డాయి. దొర్లుకుంటూ వెళ్ళి గదిలో మూలతల్లక్రిందులుగా ఆగిందితల. అనసూటిగా పోలాకునే చూస్తున్నట్టుంది.

బల్లమీంచి తల పడడంతోనే తుళ్ళిపడి నంచుండిపోయాడు పెరేరా. కంగారుగా తనమాతృభాష పోర్చుగీసులో ఏమేమో వాగేస్తున్నాడతడు.

"తుపాకీ ఇప్పించండి సర్కార్," వంగి సలాం చేస్తూ అన్నాడు రాడీ. అతడిచేతిలో ఎర్రగుడ్డ వేలాడుతూ వుంది.

మూల తల్లకిందులుగా వున్న తలకేసి చూశాడు పోలాండు దొర. సరిగ్గా తన కల్లో కనపడ్డట్టే వుందది. దాన్నిచూస్తూ వుంటే తన బుర్రలో ఏదో ఇరయిపోతున్నట్టు వుందతడికి.

పెరేరా ఇంగ్లీషులో అన్నాడు: "వీణ్ణి చంపేశావూ? స్వయంగా నువ్వు చంపలేదూ?" గట్టిగా అన్నాడతడు.

"నేనే స్వయంగా ఎందుకు చంపాలీ?"

"అయితే — అది మళ్ళదు."

"ఏమిటీ మళ్ళడం?"

"అరేరే, పేకంతా పాడయిపోయిందే!"

"మళ్ళడమంటే ఏమిటి నీఉద్దేశం?"

"శ్రీ బాను నించి కొత్తపేక పంపాలి నువ్వు."

"సరే, కాని మళ్ళదు అంటే ఏమిటి అర్థం?"

"ఛా, అది పిచ్చినమ్మకం. నాకు సరిగ్గా జ్ఞాపకమూ లేదు. నీగ్రోలు ఏమంటారంటే, మంత్రగాడు — వాడు మంత్రగాడే — పోనిద్దూ, ఇవన్నీ వొట్టి పిచ్చిమాటలు. సంగతేమిటంటే — పోగ్రామామనిషి చిల్లంగి పెట్టాడనుకో, అప్పుడు వాడి

చేతే అది మళ్ళించుకోవాలి. లేదా వాణ్ణి స్వయంగా చంపెయ్యాలి...అబ్బా వృత్తిదద్దమ్మలా మాట్లాడేస్తున్నాను"

పోలాకు మళ్ళీ తల కేసి చూస్తూ తిట్టడం ప్రారంభించాడు. "ఈ వెధవ ఇలా చూడ్డం అసహ్యంగా వుంది" అంటూ వున్న పాళంగా లేచి వొక్క తాపు తన్నాడు తలని. కొంత దూరం దొర్లి ఆగింది తల. కాని మళ్ళీ తలక్రిందులుగానే ఆగి పోలాకు దిక్కే చూస్తోంది.

"చాలా వికారమైన మొహం," అన్నాడు పెరేరా — "ఎంత పాడుగా వుందో! మొహం మీాద కత్తితో గంట్లు పెట్టుకుంటారు వీళ్ళు"

మళ్ళీ తన్నాడు పోలాకు. అతణ్ణి ఆపుతూ "తుపాకి కావాలి" అన్నాడు రాడీ. భయపడుతూ తల కేసిచూశాడు వాడు.

"వొకటికాదు, రెండు పుచ్చుకుందువుగాని. ఈ వెధవ తలకాయని మాత్రం ఇక్కణ్ణుంచి పట్టుకుపో" బొంగురు గొంతుకతో అన్నాడు పోలాకు.

"ఉహూఁ." తల వూపేశాడు మొండీ. ఒక్కతుపాకే కావాలి. ఒక్కటే ఖరారు చేశారు. ఆ వొక్కటే దొరికితే చాలు. విధేయుడై వుంటాడు వాడు.

పోలాకు ఎంతో బోధపరిచాడు. బతిమిలాడాడు. లాభం లేకపోయింది. ససేమిరా వొప్పుకోలేదు వాడు. నూటికి మూడురూపాయలు లాభం ధరలో పెరేరాదగ్గిర అమ్మకానికి

వాళ్ళ తుపాకీ వుంది. అది కొని రాడీకి ఇచ్చేశాడు పోలాకు. తుపాకీ పుచ్చుకొని వెళ్ళిపోయాడు రాడీ. తనకి ఇష్టంలేక పోయినా పోలాకు చూపులు ఆతల మీాదికే వెళ్ళి వాలుతున్నాయి.

"చిత్రం! దొర్లిదొర్లి ఈతల సరిగ్గా తలకిందులా నిలిచి పోతోంది! ఆటబొమ్మలు వస్తుంటాయే — కింద సీసం పెట్టడం వల్ల ఎలా వేసినా నిలబడిపోతా యవి — అదిగో అల్లాగ. వీడి మెదడు తప్పకండా బరువైందయి వుండాలి. అంచేత ఎలా వేసినా తలకిందులుగా వుంటోంది. పోలాక్! నువ్వు వెళ్ళేటపుడు దీన్నికూడా వెంటపట్టుకుపో. ఇప్పుడేపట్టుకు పోవడం మరీమంచిది ఇక్కణ్ణుంచి. పీక పాడేఅయిపోయింది. ఫ్రీటౌనులో వాళ్ళడు అమ్ముతున్నాడు. — గదంతా పాడుచేసేశాడు మేండీ వెధవ — నువ్వే వీణ్ణి చంపెయ్యవలసింది."

గుండె దిట్టం చేసుకున్నాడు పోలాకు. తల దగ్గిరికి వెళ్ళాడు పైకెత్తి చూడ్డం మొదలుపెట్టాడు. లాంతరు వేలాడదీసే తీగెవాంకీకి తలవేలాడదీశాడు. గొయ్యితీసి దాన్నిపాతి పెట్టెయ్యాలని అతడి సంకల్పం. తల్లకిందులా కాకుండా జుత్తు మీాదికీ పీక కిందికీ వుండేట్టు వాంకీకి వేలాడదీసి వెళ్ళినట్టు అతడికి జ్ఞాపకం. కాని గొయ్యితీసి తిరిగివచ్చి చూసేసరికి మళ్ళీ తల్లకిందులా వుంది తల.

పొద్దుగూకి పోతూవుంది. తనబసకి ఉత్తరంగా ఆతల పాతిపెట్టేశాడు పోలాకు. రాత్రిళ్ళు అటువెళ్ళే అవసరంవుండ

దతడికి. నిద్రపోయేముందు మరి రెండు పాములు చంపాడు. రాత్రి సగం రాత్రికి దాటింది. పక్కమీంచి తుళ్ళిపడి లేచాడు పోలాకు. జాగ్రత్తగా చీకటికి చెవు లప్పగించి విన్నాడు. ఏదో నడిచినట్టు టపటప చప్పుడు! దేన్నో ఈడ్చినట్టూ వినిపిస్తోంది. ఊపిరి బిగబట్టి కూచున్నా డతడు. మెల్లిగా తలగడకింద చెయ్యిపెట్టాడు. రివాల్వరు పైకితీశాడు. ఏదో మెల్లిమెల్లిగా గుర్రుపెట్టినట్టు శబ్దం! శబ్దం గురిపెట్టి రివాల్వారు పేల్చాడుపోలాకు. ఏదో కంయ్యి మంది. కనిపించీకనిపించని మసకవెలుగులో ద్వారంలోంచి ఏదో పారిపోయింది. "వెధవ కుక్క" పడుకుంటూ గొణి గాడు పోలాకు.

తెల్లవారింది. కళ్ళు విప్పాడు పోలాకు. ఏదో చిరాకు చిరాకుగావుం దతడికి. ఎముకల్లో మళ్ళీ నొప్పిగానూ వుంది. ఇంటికప్పునిండా ఎర్రచీమలు పాకుతున్నాయి. బాగా వెలుగు వచ్చేసింది. పక్కకి వొత్తిగిల్లి కిందికి చూశాడు. ఏదో నల్లటివస్తువ కిందపడివుంది. బాగా చూశాడు. తుళ్ళిపడి వొక్కసారి మడతమంచం మీంచి కింద పడిపోయాడు. పోగ్రామమనిషి తలకి గజందూరంలో పడ్డా డతడు. గోతి లోంచి పైకితీసి రాత్రికుక్క పట్టుకువచ్చింది తల. ముక్కూ అదీ తెగిపోయివుంది. దానినిండా చీమలు పాకుతున్నాయి. ఈగలు జమ్మని ముసురుతున్నాయి. ఇప్పటికీ అది ఎంచేతో

తల్లకిందులుగానే వుంది, పుర్రె కిందికీ మెడ మీాదికిన్నీ. మొహమూ అలాగే వుంది. అదే పాత చూపు.

కొయ్యబారిపోయూడు పోలాకు. ఎంతో సేపు ఆవికార స్వరూపం చూస్తూ నుంచుండిపోయూడు. తరవాత దాన్ని తప్పించుకుని మెల్లి మెల్లిగా టిన్ను షెడ్డులోంచి బైటికివెళ్ళాడు. కరకర మంటోంది ఎండ. గాలికి చెట్లు కొంచెం కొంచెం కదులుతున్నాయి. తల పాతిపెట్టినగొయ్యి చూశా డతడు. కుక్క తవ్వినట్లు గోళ్ళగుర్తులు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఆగుర్తులుచూశాక అతడి గుండెల్లో బాగా ధైర్యం వచ్చింది.

రాత్రి జరిగిందంతా వొక తమాషా లాగ పెరేరాతో చెప్పాడు పోలాకు. చెపుతూవున్నంత సేపూ అతడి పెదవులు ఎండిపోతూ వచ్చాయి. అంతా విన్నాడు పెరేరా. నవ్వుదామని ప్రయత్నిస్తూనే అన్నా డతడు: "నువ్వు కుక్కని బెదర గొట్టేశావు. దాన్ని తరిమెయ్యకండా వుండవలసింది."

ఓడకోసం కనిపెట్టుకుని వుండవలిసిన మిగతా రెండు రోజులూ ఆ తల వొదిలించుకోవాలని ఎంతన్నా ఆలోచించాడు పోలాకు. ధైర్యం కూడగట్టుకుని దాన్ని నదీ సంగమందగ్గిరికి తీసుకువెళ్ళాడు. అక్కడ దాన్ని సముద్రంలో పారేసి వచ్చేశాడు. ఎలా అది వుండిపోయిందో అర్థంకాలేదు. మొసళ్ళు దాన్నితినడం మానేశాయి. నీరు పోటెక్కినప్పుడు దాన్ని నదివొడ్డుకి తెచ్చి, బురదలోపారేసి పోయింది సముద్రం.

బుద్ధిమంతుడైన అరబ్బీవాడొకడు అదితీశాడు. అపూర్వమైన దేశీయవస్తువని అమ్మడానికి పోలాకు పెరేరా దొరల దగ్గిరికి పట్టుకు వచ్చాడు. వాడు వచ్చేసరికి సాయంకాల మవుతూవుంది. తల ధర చెపుతూ చీకటయేవరకూ అక్కడే వుండిపోయాడు వాడు. ఈ ఇద్దరు దొరలూ ఆ తల పుచ్చుకోరనీ, దాన్ని చూస్తే జంకుతున్నారనీ గ్రహించేశాడు తుదకి. ఇక లాభం లేదని వెళ్ళిపోయాడు. పోతూ పోతూ తల పోలాకు బసచేసిన చిన్న పొద్దులో పారేసి మరీపోయాడు. తెల్లవారేసరికి ఆపాడు వెధవతల తనదగ్గిరే వుండడంచూశాడు పోలాకు.

కోపంతోనూ, భయంతోనూ అతడిస్థితి దుర్భరంగా వుంది. 'ఈ పాడుముండాతల కాల్చేసి బుగ్గిచేసేస్తేకాని మన్ని వొదలదు.' బారెడుపొద్దు పైకిరాగానే ఆతల వేలాడదీసి దూరంగా పట్టుకు వెళ్ళాడు పోలాకు. అక్కడ పుడకలతో చిన్నచితి పేర్చాడు. చితిమీాద పెట్టాడు. అదే సమయానికి మూడ్రోవియానించి వాభర్లు వెళ్ళే చిన్నస్టీమరు వూల వేసింది. "హమ్మయ్యా, బతికిపోయాను దేవుడా?" అన్న మాటలు పోలాకు నోటినించి అప్రయత్నంగా బైటికివచ్చాయి. స్టీమరు వూలతో తానుబైటపడే ధ్వనికూడా ఇమిడివుంది! వణుకుతున్న చేతుల్తో చితికి అగ్గి ముట్టించేశాడతడు. మళ్ళీ వెనక్కి చూడకండా బసకి వచ్చేశాడు. సామాను గబగబా సర్దేసి పెరేరా దగ్గిర సెలవు తీసుకున్నాడు.

ఆరోజు సాయంకాలం స్టీమరు బయల్దేరింది. బురదతో వున్న పాడు సలీమా వొడ్డు దూరంగా పోతూవుండడం సంతోషంగా చూశాడు పోలాకు. స్వేచ్ఛతో పెద్ద నిట్టూర్పు విడిచాడు. నదీసంగమం క్రమక్రమంగా సంకీర్ణంగా అవుపిస్తూ చివరికి కనపడకండా మాయమైంది. తన బాధలు కూడా మాయమై పోయాయని సంతోషించాడు పోలాకు. భయమూ, విచారమూ, మెల్లిమెల్లిగా తనని త్రిమిరాంచి దిగిపోయాయి. సులేమాలో వున్నపుడు పోగ్రాహామనిషి తాలూకు చిల్లంగి మీదనమ్మకమున్న పాడువాతావరణంలో మునిగివుండేవాడతడు: పోగ్రాహాభయం అతణ్ణి తినేస్తూవుండేది. తన్నివదలకుండా చుట్టేసి పీడించేది. పోగ్రాహాప్రదేశం దూరంగా వుందిపుడు. చిన్నదిగాఅవుపిస్తోంది. నీలిసముద్రమూ, మేండ్రప్రదేశం కొండలూ — వీటిదగ్గిర అదొక చిన్న నీటిబొట్టులాంటిది.

"నీ కొక నమస్కారం' పోగ్రాహా! మళ్ళీ రెండోసారి నీదర్శనం కాకుండా వుండాలినాకు!" అన్నాడు పోలాకు.

ఓడ కెప్టెను వచ్చాడు. పోలాకు దగ్గిర ఇనపగజాలుమీద చెయ్యివేసి నుంచున్నాడు. నిర్లక్ష్యంగా నీట్లో ఉమ్మేస్తూ "నమస్తే" అని పోలాకుతో సంభాషణ ప్రారంభించాడు. "ఇవాళ సముద్రపొడ్డుని నాకో చిత్రమైన వస్తువు దొరికిందండీ. ఇంతవరకూ ఇలాంటిది ఎక్కడా చూడలేదు నేను."

"ఏమిటదీ?" అన్నాడు పోలాకు.

"పొగ పారించి ఎండబెట్టిన మనిషితల"

"ఏమిటీ? –" కంగారుపడుతూ అడిగాడు పోలాకు.

"ఈప్రాంతం పోౖరాహాజాతి మనిషి దేవరిదో తల. మొహంనిండా గంట్లుగంట్లుగా చెక్కివుంది. – అరే, అరే! ఏమిటదీ? – ఏమీ లేదయ్యా! – మీరింత పిరికి మనిషి అనుకోలేదు నేను! ఇలా పాలిపోయిదేం మీ మొహం? ఓయి బాబోయి! మీలాంటి మనిషి సముద్రంమీద ప్రయాణం చెయ్యడం మంచిదికాదే! ఏం, ఇప్పుడు నయంగా వుందా! ఓయి దేవుడా! ఎలావోణికి పోయూరో మీరు! అబ్బే, కోసినతల దొరికిందనిమాత్రం చెప్పానండీ. అయితే, అది చిత్రంగావుంది. చెడిపోకండా దాన్ని ద్రావకంలో వేసి, చచ్చిన పాముల్తోపాటు జాగ్రత్త చేశాను. ఇలాంటివి చాలాచాలా సంగ్రహించి నా కేబినురూములో వుంచుతాను నేను. చిన్న మ్యూజియం అనుకోండి నాగది. చిత్రమేమిటంటే తల్లకిందులుగా వుంటుంది ఈతల. వుౖరెభాగం కిందికి, మెడ మీదికిన్నీ అరే! ఏమిటిది? ఏమయింది మీకు?"

భయంతో వెర్రికేక వేశాడు పోలాకు. జుత్తు పీక్కున్నాడు. సముద్రంలో గెంతెయ్యాలని డెక్కుమీద పరుగెత్తాడు. కాని అంతలోనే తెలివి తెచ్చుకున్నాడు. కెప్టెనుకేసి తిరిగాడు.

"హేయ్, హేయ్," కేకలు వేశాడు కెప్టెను – జేర్, ఫిలిప్స్ ఈయన్ని తీసుకువెళ్ళిపొండి ఇక్కణ్ణుంచి. దూరంవుండండయ్యా దగ్గిరికి రాకండి, ఏమయింది మీకూ? పిచ్చెత్తలేదుకదా!"

చేతుల్తో తల గట్టిగా పట్టుకున్నాడు పోలాకు. తనబాధ ఎలా పైకి చెప్పడం? "అప్పుడప్పుడు భయపడిపోతూ వుంటాను నేను" అన్నాడతడు. "ఇక్కడ చాలా బాధగావుంది క్షమించాలి. మీరు చెడ్డగా భావించలేదుకదా!"

అతడి మొహంమీద చెక్కితే నెత్తురులేదు. ఒళ్ళంతా ముచ్చెమటలు పోశాయి. ఇలామాటాడితే పిచ్చివాడనుకుంటారని చప్పునతోచిందతడికి. చాలాకష్టంమీద కెప్టెనుతో సరిగా మాట్లాడాడు. అతడడిగినదానికి నెమ్మదిగా జవాబు చెప్పాడు. నొప్పిగా వుందన్నచోట కెప్టెను చెప్పినప్రకారం బ్రాందీ రుద్దాడు. తరవాత కెప్టెను సంగ్రహించిన మ్యూజియం గురించీ అడిగాడు' ఎక్కడెక్కణ్ణుంచి, ఏయే వస్తువులు సంపాదించిందీ కనుక్కున్నాడు. ఆ వింత తలగురించి మళ్ళీ వర్ణించాడు కెప్టెను. తల విషయం వింటూన్నంతసేపూ వోడంతా గాజులాంటి పదార్థంతో తయారుచేసినట్టు కనిపిస్తోంది పోలాక్కి. గాజుకుండలో తల్లకిందులావున్నతల స్పష్టంగా అవుపిస్తోనే వుందతడికి.

సులీమాలో కంటే వోడమీదే పోలాకు స్థితి దుర్భరమైపోయింది. ఎక్కడపిచ్చెత్తిపోతుందో అన్నభయంతో రోజంతా తనని తాను సంబాళించుకోవలసి వచ్చింది. అయినా ఆ తల విషయం ఘోరంగా జలగలాగ వొదలకుండా తన బుర్రలో వుండిపోయింది. రాత్రి మళ్ళీ పాడుకలలు వచ్చాయి. వికారమైన వొక కలతో మెళుకువ వచ్చేసింది. భయంతో ముడు

చుకుపోయి పక్క-మీాద పడివున్నాడు. గొంతుకలో సన్నని మూలుగు పుట్టింది.

వాథర్డులో ఆ స్టీమరు వొదిలిపెట్టేశాడు పోలాకు దొర. స్టీమరుతో పాటు ఆ వికారపు తలా వొదిలేశాడు. కాని రాత్రిళ్లు కలలుమాత్రం వొదలలేదు. కళ్ళల్లో నొప్పులూ అలాగే వున్నాయి. టెనెరీఫ్‌లో వొక పెద్దస్టీమరు దొరికింది. అది కేప్ టౌనునించి వస్తోంది. కాని ఆ తెగిన తలమాత్రం పోలాకు బుర్రలోంచి పోలేదు; వెంటాడుతూనేవుంది. అతడు జూదంలో మనస్సు పెట్టాడు; పేకాడుతూ మనస్సు మార్చుకోవాలని ప్రయత్నించాడు. పుస్తకాలు చదువుతూ గతం మరచిపోవాలనుకున్నాడు. సారావల్ల వచ్చేఅనర్థం అతడికి బాగా తెలుసు. కనక దానికోసం ప్రయత్నించలేదు. ఏదయినా నల్లటివస్తువు కానీ, నల్లటినీడ కానీ కనిపించిందో—అందులో ఆ తెగిన తల కోసం చూసేవా డతడు. అతడు చూసినట్టే అందులో తల సిద్ధంగా వుండేది. అదంతా తన భ్రాంతేఅనీ, ఆ భ్రాంతే తనని అలా ఆడిస్తోందనీ అతడికి తెలుసు. అయినా, ఆ పెద్దస్టీమరూ, తన తోడిప్రయాణీకులూ, వోడపనివాళ్ళూ, విశాలసముద్రమూ – అంతా అసత్యమైన వొక మాయ తెరఅనీ అనిపించేదతడికి. ఈ మాయ తెర తొలిగించి తాను తల్లకిందులావున్న ఆ తల చూస్తున్నాడనీ అనిపించేది. ఆ పోర్రాహామనిషి తలా, వాడి వెటకారపు నవ్వూ – ఈ రెండే ప్రపంచంలో సత్యమైనవనీ, తక్కిందంతా అసత్యమైందనీ అనిపించేది. ఈ భావం

బుర్రలో దూరగానే ప్రతీవస్తువా పట్టిచూసేవా డతడు. కొన్ని నోటితో రుచి చూసేవాడు ; పళ్ళతో కొరికేవాడు. అగ్గిపుల్ల వెలిగించి తన చెయ్యి కాల్చి చూసేవాడు. మొహం సూదితో పొడుచుకునేవాడు. ఇదంతా నిజమా ? పోగ్రామా తలకాయ నిజమా ? పోగ్రామా తల భ్రాంతీ, తన బుద్ధీ — ఈ రెంటికీ సం గ్రామం జరిగేది. ఆ భ్రాంతిని తరిమెయ్యాలని పెనగులాడే వాడతడు. శాయశక్తులా ఎదిరించేవాడు. అలాగే అతడు ఇం గ్లాండు చేరుకున్నాడు. సౌథాంప్టనులో దిగి, వాటర్లూనించి తిన్నగా వొక అద్దెబండి తీసుకొని, కార్న్‌హిల్లో వొక బ్యాంకుకి వెళ్ళాడు. ఆ బ్యాంకులో అతడిసొమ్ము జమకట్టి వుంది. బ్యాంకు మేనేజరుతో వొక ప్రయివేటుగదిలో ఎంతోసేపున్నా డతడు. ఏవేవో పద్దులుగురించీ, వొక విల్లుగురించీ మాట్లాడాడు. అంత సేపూ ఆ తెగినతల తనకి కనపడుతూనే వుంది. ఏదో తీర్చి పెట్టిన వస్తువులాగ, నల్లబలపపురాత్తో చేసిన మాంటిలుకింద తల్లకిందుగా వేలాడుతూవుందది. రక్తపుచుక్కలు కింద టప టపా పడుతున్నాయి. టపటప పడుతూవుండడం వినిపిస్తూనూ వుంది. కింద గచ్చుమీద మరకలూ కనిపిస్తున్నాయి.

మాంటిలుకింద వేలాడుతూన్న అందమైన పూలగోలెం దిక్కు రెప్పవెయ్యకుండా పోలాకు చూస్తూవుండడం చూసి అందంగావుందికదూ పూలమొక్క ?" అన్నాడు మేనేజరు— " ఐతే దీనిమూలాన కింద గచ్చు మరకలై పోతూవుంది. "

"అవును" అన్నాడు పోలాకు — "చాలాఅందంగావుంది. అన్నట్టు మీ మాటకి అడ్డువచ్చాను, మొంటలువ్యాధి కుదర్చ గల మంచిడాక్టర్నెవర్నయినా చెప్పగలరా? నా ఆరోగ్యం సరిగా లేదీమధ్య. అప్పుడప్పుడు వూరికే కల్పితదృశ్యాలు కని పిస్తూ వుంటాయి. ఏం చెప్పనూ, అదంతా డెల్యూసినేష నను కుంటాను."

తల్లకిందులా వేలాడుతూవున్న తల పోలాకు మాటలికి గట్టిగా నవ్వింది. మేనేజరు అది వినకపోవడం పోలాక్కి ఆశ్చ ర్యంవేసింది. మేనేజరు పోలాకు మొహంరెప్ప వెయ్యకండా చూస్తున్నాడు.

మొంటలు డాక్టరు చిరునామా చేత్తో పట్టుకుని కార్న్‌హిల్ విడిచిపెట్టాడు పోలాకు. అద్దెబండి ఏదీ అవుపించలేదు. కాలి నడకనే పడమటిదిక్కు వెళ్ళాడతను. అలావెళ్ళి మేన్సను హౌసుదగ్గిర నుంచుని నాలుగురోడ్లూ పరికించాడు. లండనులో కాపరముంటూన్న పాతవాళ్లుకూడా ఈ నాలుగురోడ్లూ దాట డం కష్టం. బళ్ళూ, మోటార్లూ, గుర్రపుబళ్లూ, బస్సులూ ప్రవాహంలా నడుస్తూవుంటాయి. ఆఫ్రికానించి అప్పుడే దిగిన మనిషికి అదొక మహాసముద్రంలా వుండడంలో చిత్రమేమీ లేదు. జాగ్రత్తగా ప్రయత్నిస్తే పోలాకు బహుశా దాటివెళ్ళ గలడు. కాని తన మోకాళ్ళమధ్య ఫుట్‌బాలులాగ, తల్లకిం దుగావున్న వొక తలకాయ గెంతుకుంటూ, దొర్లుకుంటూ వస్తూవుంటే — అదిన్నీ, రక్తం మరకలు వరసపెడుతూవస్తూ

వుంటే — ప్రమాదంరాకండా వుంటుందా? దొర్లివస్తూన్న ఆతలమీద కాళ్ళుపడకుండా ప్రయత్నించి గెంతులువేశాడు పోలాకు. కాని లాభంలేకపోయింది. అది కాళ్ళకింద పడింది. అతడు కిందపడిపోయాడు. అదేసమయంలో ఏదోబండి అతడి నీపు గుద్దేసింది. చెయ్యి ప్రాణంపోయినంత నొప్పిపెట్టింది.

ఒక గుర్రపుబగ్గీ అతణ్ణి గుద్దేసింది. గుర్రండెక్క అతడిచేతి మూడువేళ్ళు మట్టేసింది. ఆ మూడువేళ్ళతోనే అతడు పోర్రా హామనిషిమీద రివాల్వరు కాల్చాడు. జనం పరుగెత్తుకు వచ్చారు. బగ్గీ కిందినించి అతణ్ణి పైకి తీశారు. అతడిచేతిలో మెంటలు డాక్టరు చిరునామా చూశారు.

రెండు మూడు దినాలు క్లోరోఫారం నిషాలో వుండిపోయాడు పోలాకు. బాధకలిగించేవి ఏవేవో అతనిమీద వుపయోగించినట్టుమాత్రం అతడికి గుర్తుంది. కాని నొప్పిమాత్రం పెట్టలేదు. కదలకండా అతడు పడుకున్నాడు. ఆహారంమాత్రం వేళకి లభిస్తోంది. చిన్నజ్వరంకూడా తగిలింది. దాహం వేసింది. ఆ నాళ్ళే మళ్ళీ పాతకలలు ఆ పీడకలలు వచ్చాయి. మళ్ళీ వచ్చాయి, నిజమే. కాని వొకటి రెండు రోజులయినా వొదిలాయికదా అనిమాత్రం గమనించాడతడు.

"వేళ్ళకి బదులు నా తల చిదిగిపోయి వుంటే బావుండేది. ఈ వెధవ వొదిలి పోను" దగ్గిరిగా వున్న నల్లటి దిండు చూస్తూ గొణిగాడు పోలాకు. కొంచేపటినించీ ఆ గుండ్రటి నల్లదిండు తల్లకిందుగా వున్న తలకాయగా తయారైంది.

డాక్టరుతో మాట్లాడిన మొదటిసారే తన పరిస్థితి చెప్పాడు పోలాకు. ఇలా ఇక సాగదనీ, ముందు ముందు తప్పకండా పిచ్చివాణ్ణయి పోతాననీ తనకి బాగా తెలుసు. ఆఫ్రికాలో భయంకరమైన వొక హత్య చూశాననీ, తెగిన తల వొకటి దెయ్యమై తనని వెంటాడుతూ వుందనీ డాక్టరుతో చెప్పా డతడు. పాకలో జరిగింది వున్న దున్నట్లు చెప్పడం ఇష్టం లేదు. చాల గంభీరంగా పోలాకుని చూశాడు డాక్టరు.

"చిన్నప్పుడు మీరు ధార్మిక శిక్షణలో పెరిగారా?" సందేహిస్తూ అడిగాడు డాక్టరు.

"ఏదో. చెప్పుకోవలసినంత కాదు" అన్నాడు పోలాకు. డాక్టరు మొహం మరింత గంభీర మైపోయింది.

"మీరు 'ధార్మిక చికిత్స' పేరు విన్నారో లేదో చెప్పలేను. లూయీలో ధార్మిక చికిత్స ద్వారా బాగు చేస్తారు. రోగుల్ని."

"ధార్మిక చికిత్స వల్ల ఏమీ లాభం వుండదనే నా భయం" నల్లదిండు కేసి చూస్తూనే అన్నాడు పోలాకు. గండ్ల మొహం వికారంగా పెట్టింది తల. మరో చికిత్స ఆలోచించాడు డాక్టరు. చప్పున ఉత్సాహం తెచ్చుకుని అన్నా డతడు — "ఛా, ఇదంతా వొట్టి కల్పన. ధర్మచికిత్స అయితే బావుండేది. పోనీండి ఇప్పుడు మీ ఆరోగ్యం ఏమీ బాగులేదు. శరీర స్థితి సందేహాస్పదంగా వుంది. తెగిన తల మీ మీద బాగా దెబ్బతీసింది. సరే, ఇప్పు డొక మంచి మందిస్తాను.

అది నరాలశక్తి వృద్ధిచేస్తుంది. మెదడుకి చలవ చేస్తుంది. మంచి పుష్టి కలిగిస్తుంది. తరువాత రిగ్యులరుగా మీరు వ్యాయామం చెయ్యాలి."

"నాకు ధర్మచికిత్సమీద ఏమాత్రమూ నమ్మకం లేదు" అన్నాడు పోలాకు.

"అందుకనే మీ శారీర స్థితి బాగుపడడం అవసరం. బైటి చల్లగాలి తగలాలి. స్కాట్లండు వెళ్లండి. నార్వే, స్వీడన్‌లాండూ తిరిగి రండి"

"మీ ఇష్టం వచ్చిందగ్గిరికి పంపండి. నరకంలోకయినా సరే, సిద్ధం" బరువైన గొంతుకతో అన్నాడు పోలాకు.

చేతి గాయం బాగయింది. డాక్టరు సలహా అనుసరించాలనే అతడి ప్రయత్నం. నవంబరు మాసం వచ్చింది. ఫుట్ బాలు ఆడడం మొదలెట్టాడు పోలాకు. అయితే ఫుట్ బాలుకి బదులు ఆ తలకాయే కాలితో తంతున్నట్లు వుండే దతడికి. ఎప్పుడూ సరిగ్గా ఆడలేక పోయేవాడు. బంతి తన్నబోయే ముందు కళ్లు మూసేసుకునేవాడు. అతణ్ణి గోలు కీపరుగా పెట్టారు. జంయ్యిమని బంతి వచ్చేసరికి, వెర్రి కేకవేసి పక్కకి తప్పుకు పారిపోయాడు.

చెడు నడత వల్ల ఎన్నో నింద లుండే వతడి మీద. అందుకనే అతడు లండను వొదిలేసి ఆఫ్రికా వెళ్లాడు. మళ్లీ తిరిగి రావడంతోనే ఆ కథలన్నీ బైటికి వచ్చాయి. అంచేత మగవాళ్లలో మాత్రం అతడికి స్నేహితు లుండేవారు. కాని

ఇప్పటి పిచ్చి పిచ్చి చేష్టలతో వాళ్లుకూడా దగ్గిర చేరడం మానేశారు. ప్రతీవాడూ దూరంగా వుంటూ వచ్చాడు. తెగిన తల ఇప్పుడు కేవలం కనపడడం మాత్రమే కాదు. అతడితో మాట్లాడ్డమూ మొదలెట్టింది. అతణ్ణి వెక్కిరించేది. వికారంగా మొహం పెట్టేది. భయపెట్టేది. మరో కొత్త ఉపద్రవమేమిటంటే — ఏదో వస్తువ తలగా మారడం కాదిప్పుడు. అది సరాసరి ఎదురుగుండా వచ్చేసేది. అప్పుడే నరికిన తల లాగ ప్రత్యక్ష మయేది. ఒంటిరిగా వున్నప్పుడల్లా చేతులు జోడించి దాన్ని బతిమిలాడేవాడు పోలాకు. దెబ్బలాడేవాడు. బెదిరించేవాడు. ఒకటి రెండుసార్లు ఇద్దరి ముగ్గురి ఎదుట కూడా దాంతో మాట్లాడాడు. తన తోడివాళ్లంతా తనని పిచ్చివాడికింద కట్టేశారని గ్రహించేశాడు. ఇంటి నౌకర్లూ, ఇంటి యజమానురాలూ అతణ్ణి సందేహంతో చూసేవాళ్లు.

డిసెంబరు మొదట్లో అతడి పినతండ్రి కొడుకు ఆర్నాల్డు అతణ్ణి చూడాలని వచ్చాడు. ఆర్నాల్డు వొక్కడే తనకి కావలసిన బంధువు. అతడు వచ్చి పోలాకుని ఇంట్లోంచి బైటికి బయల్దేరదీశాడు. అతడి పాలిపోయిన మొహామూ, లోపలికి చొచ్చుకుపోయిన కళ్లూ చూశాడు. ఆర్నాల్డు పట్టుకున్న టోపీ చూశాడు పోలాకు. అది టోపీకాదు. కోసిన తల. తల్లకిందుగా వుంది. తనవత్తే చూస్తోంది. పిచ్చెత్తకండా బ్రహ్మాండమైన ప్రయత్నం చేస్తున్నాడతడు. తన బుర్రలోంచి

తల ప్రశక్తి తీసి ప్రాపారెయ్యాలని చెయ్యవలసిందంతా చేస్తు న్నాడు. ఒక సైకిలు పుచ్చుకుని బాండ్సువద్ద నించి కింగ్సు టౌనుకి రోడ్డుమీద బయల్దేరాడు. అయితే, దొర్లుకుంటూ తనతోకూడా ఆ తల రావడం కనపడుతూనే వుంద తడికి. దారికడాకూ రక్తం మరకలు పడుతూనే వున్నాయి. పళ్లు బిగించి సైకిలు జోరు చేశాడు పోలాకు. రోడ్డు మెలికి తిరిగేసరికి తలకూడా సైకిలంత జోరుగా, సైకిలు చక్రంతో పాటు దొర్లుకుంటూ వచ్చేస్తోంది. ఊహించడానికైనా వీల్లే నంత జోరుగా వచ్చేస్తోంది. దాన్ని తప్పించుకోవాలని టపీ మని హాండిలు తిప్పాడు పోలాకు. దభీమని సైకిలు తిరగ బడింది. తుళ్లిపోయి కిందపడిపోయాడు పోలాకు. ఎడమ చేతి పోచీ ఎముక విరిగిపోయింది.

క్రిస్టమసు పండుగ తొలిరోజది. అవాళే అంతా అయిపోయింది. రాత్రంతా పోలాక్కి జ్వరంగా వుంది. పోచీ మీద వేసిన పట్టీ అగ్గిలా మండుతోంది. చాలా భయంక రంగా వున్నాయి కలలు. అన్నీ నిజంలాగే వున్నాయి. బాగా మంచు కురుస్తోంది. మసక మసకగా వుంది వెలుగు. తెలతెల వారుతూ వుంది. అతడు కళ్లు విప్పాడు. మంచం మీద కూచున్నాడు. రాత్రి స్టూలుమీద పెట్టిన పెద్ద ఇత్తడి పూల కుండీ దిక్కు చూశాడు. పూలకుండీ లేదక్కడ. కుండీకి బదులు తల. తల్లకిందుగా వుందది.

"బాగా తెలును నాకు. ఇత్తడి పూలకుండీయే అది" తనలో తాను గొణిడాడు పోలాకు. భయంతో గుండెలు కొట్టుకుంటున్నాయి. సందేహం పీకుతోంది. మెల్లిగా పక్క మీంచి లేచాడతడు. పూలకుండీ దిక్కు వంగాడు. చేయి చాచాడు. వణుకుతూ వుంది చెయ్యి. అదంతా తన కల్పన చేస్తూవున్న మోసమే అని తేల్చి ద్యా లిప్పాడు. ఇత్తడి తళుకు స్పష్టంగా పోల్చుకోగలడు తాను. ఎంతో సేపు వెనకా ముందూ ఆలోచించాడు. చివరికి తలగదుకు మొహం మీద వేళ్లు పెట్టాడు. వెంటనే తుళ్లిపడ్డాడు. చెయ్యి వెనక్కి లాగేసుకున్నాడు. చిల్లంగివాడి తల ప్రభావం పట్టశక్యం కానట్టుండప్పుడు. పోలాకు స్పర్శ శక్తికూడా తనని టోకరా కొట్టించింది.

గజగజ లాడిపోయాడతడు. మంచ మీంచి కంగారుపడి లేచిపోయాడు. ఉత్తి పాదాల్తోనే తన జోళ్ళు తన్నేస్తూ గాభరాగా డ్రెస్సింగు రూములోకి పరుగెత్తాడు. అంతటా పొగలు కమ్ముకొస్తున్నట్టుందతడికి. ద్వారం తెరిచేశాడు. మంగలికత్తి చేత్తో పుచ్చుకున్నాడు. దభీమని మంచం మీద చదికిల బడ్డాడు. ఎదురుగుండా అద్దంలో తన మొహం కనిపిస్తోంది. పాలిపోయీ, ఎండిపోయీ, నిరాశగా, నిర్జీవంగా వుందది.

తన జీవితంలోని సంఘటనలన్నీ గబగబా తన కళ్ళముందు కనిపిస్తున్నాయి పోలాక్కి. తన కుటుంబకష్టమూ, దానిమిం

చిన స్కూలు కష్టం దినాలూ, తరవాత తన చెడ్డతిరుగుళ్ళూ, తాను తెచ్చుకున్న వాళ్ళక్క ఆపదా — ఇవన్నీ ఆ చల్లటి ఉదయవేళ కఠోరంగా అవుపిస్తున్నాయి. ఆఫ్రికాలో ఆ పాకలో తాను పోగ్రాహాస్త్రీ దగ్గిరికి వెళ్ళడం చూస్తున్నాడతడు — పోగ్రాహావాడితో దెబ్బలాట వచ్చింది సలీమూదాకా వచ్చేసి నదీముఖం చేరుకున్నాడు — మేండీరాడీని కలుసుకున్నాడు — రక్తం కారుతూన్న గుడ్డకూడ పట్టుకువచ్చాడు వాడు. కోసిన తల నాశనం చెయ్యడానికి తాను చేసిన పిచ్చిప్రయత్నాలూ జ్ఞాపకం వచ్చాయి. భ్రమ తనని ఇష్టంవచ్చినట్లు ఆడించింది. ఇదంతా తన కల్పన. అది ఆడుతున్న ఆటే ఇదంతా. తనకి తెలుసు ఇదంతా తన కల్పనచేస్తున్న మోసం. అవును అంతా కల్పనే.

కొద్దిక్షణాలు ఆశకలిగించి అద్దంనించి తన చూపు మళ్లించి పూలకుండీకేసి చూశాడు. అక్కడ తలేవుంది. తల్లకిందుగానే వు దది మొహం వికారంగా పెట్టి అతణ్ణి వెక్కిరిస్తోంది...... కట్టులో వున్న చేతివ్రేళ్ళతో తన మెడనరాలు తడిపి చూచుకున్నాడు పోలాకు.

చాలా చల్లగావుంది ఆ ఉదయం. మెడ కోసుకున్నప్పుడు మంగలికత్తిదారు మంచులా చల్లగా జల్లుమందతడికి.

# బుగతగారి నుయ్యి

గురువులు ముంత నోటికి తగిలించగానే ఘాటయిన కంపు కొట్టింది. గంగితో అన్నాడు:

“ఏం నీళ్ళివి? చచ్చినకంపుతో తాగడానికి వీలేకండా వున్నాయి. గొంతుక ఎండిపోతుంటే, నువ్వు మురుగునీళ్లు తాగించేస్తున్నావు.”

గంగి రోజూ సాయంకాలం నీళ్ళునింపి తెస్తుంది. నుయ్యి దూరం. మాటిమాటికీ వెళ్లడం కష్టం. నిన్న తెచ్చినప్పుడు వాసన ఏమీ లేనేలేదు ఇవాళెక్కడిది? ముంత ముక్కుదగ్గిర పెట్టి చూసింది. నిజంగా కంపుకొడుతోంది. నూతిలో ఏదో జంతువుపడి చచ్చివుండాలి. కానైతే ఎక్కడనించి వస్తాయి నీళ్ళు!

బుగతగారి నుయ్యిదగ్గిర అడుగుపెట్టనివ్వరు. దూరంనించే గదమాయిస్తారు. సెట్టిగారి నుయ్యి వూరికి ఆమూల అయినా అక్కడమాత్రం తోడుకోనిస్తారా? మరి నాలుగో నుయ్యి వూళ్ళో లేనేలేదు.

గురువులు కొన్నాళ్ళయి జబ్బుతో పడివున్నాడు. కొంచేపు దాకా దాహం ఆపుకుని వూరుకున్నా డతడు.

“ప్రాణా లెగిరిపోతున్నాయి. దాహం ఆపుకోడం కష్టం. తే, అవే తే, ముక్కు మూసుకుని కొంచం తాగేస్తాను.

నీళ్ళిచ్చిందికాదు గంగి. కుళ్ళునీళ్లు తాగేస్తే జబ్బు నిమ్మళించదు; ముదురుతుంది. ఈ మాత్రం తెలుసు దానికి. కాని నీళ్ళు మరిగిస్తే వాసన పోతుందని మాత్రం తెలియదు.

"ఇవెలా తాగుతావు? ఏ జంతువుపడి చచ్చిందో! మంచి నీళ్లు తెస్తానుండు."

గురువులు ఆశ్చర్యంగా చూశాడు.

"మరెక్కడ తెస్తావు?"

"బుగతగారి నుయ్యో, సెట్టిగారినుయ్యో వున్నాయికదా! ఓ ముంతెడు తీసుకోనివ్వరా?"

"కాలో చెయ్యో విరగ్గొట్టుకువస్తావు అంతే. లాభంలేదు నోరు మూసుక్కూచో. బాపనోళ్ళు దేవతలు. శాపనార్థాలు పెడతారు. బుగత దుడ్డుకర్ర గిరవాటేస్తాడు. సెట్టివోకడయితే అయిదుచ్చుకుంటాడు. బీదోళ్ళబాధ ఎవడిక్కావాలి? మనం సచ్చినా మన గుమ్మం ఎవడూ తొంగిసూడ్డు; బుజం పట్టడం అటుండనీ. ఇలాంటోళ్ళు నూతిలో నీళ్ళు ముంచనిస్తారటే!"

గురువులు మాటలు అక్షరాలా నిజం. గంగి తిరిగి జవాబు చెప్పలేకపోయింది. కాని, ఏమయినా కంపునీళ్ళుమాత్రం తాగనివ్వలేదు గురువుల్ని.

రాత్రి తొమ్మిదిగంటలవుతుంది. అలిసిపోయిన కూలిజనం నిద్రపోయారు. బుగతగారి గుమ్మంలో మాత్రం పది పన్నెండు గురు పోకిరీమనుషులు పోగయ్యారు. బహిరంగంగా ముఖాముఖి వీరత్వం చూపించిందికి ఈ దినాల్లో అవకాశంలేదు. దానివల్ల

లాభమూ లేదు. దావాలూ వాటిమీద ప్రగల్భాలు ధణు తెగిరిపోతోంది. ఒక ముఖ్యమైన కేసులో బుగత ఎంత తెలివి తేటలు చూపెట్టాడని! ఎంత వాడుపుగా, ఇన్స్పెక్టరుని లం చం మేసి తేలిపోయాడని! ఎంతచలాకీగా నకళ్ళు సంపాయిం చాడో! నాజరూ, హెడ్డుగుమాస్తా వీల్లేదుగాక వీల్లేదన్నారు. నకళ్లు ఒకగా యాభై అడిగితే వొకరు నూరు అడిగారు. చిల్లి గవ్వయినా ఇవ్వకండా నకళ్లు పుడాయించాడో బుగత! పని చేస్తే వొడుపు తెలియాలి!

ఈ సమయంలో నూతికి నీళ్ళకి వచ్చింది గంగి. దీపంబుడ్డీ మసక వెలుగు నూతిమీద పడుతోంది. నూతి గోడచాటుని అవకాశంకోసం కనిపెట్టుకు కూచుంది గంగి. ఈ నూతినీళ్ళు వూరంతా తోడుకుంటారు. అందరూ తాగుతారు. బుగతగారి నుయ్యి అది. ఎవ్వరికీ అక్కడ నిషేధంలేదు. ఒక్క ఈ అభా గ్యులుమాత్రం నుయ్యి ముట్టడానికి వీల్లేదు.

గంగి హృదయంలో తిరుగుబాటు చేస్తోంది. క్రమాగతంగా వస్తోన్న నియమాలమీద, జబర్దస్తీలమీదా ఆమె మనస్సులో తృణీకారం తలెత్తుతోంది.

" మేం తక్కువా? వీళ్ళు ఎక్కువా? ఎందుకో? వీళ్లు మెళ్లో దారప్పోగులు వేసుకుంటారనా! ఇక్కడ చేరిన వీళ్ళంతా వొకరికంటే వొకరు ఘటికులు దొంగతనాలు చేస్తారు. ఫోర్జ రీలు చేస్తారు. అబద్ధం కేసులు పెడతారు. ఈ బుగత అవాళ గొల్లవాళ్ళ గొర్రె ఎత్తుకుపోయి చప్పరించేశాడు. ఈ బడిపం

తులు ఇంట్లో ఏడాదిపాటూ జూదం రాంభజనలావుంటుంది. ఈ సెట్టి నెయ్యిలో నూనె కలిపేసి అమ్మేస్తాడు. వీళ్ళ జిమ్మ పడా, కూలి చేయించుకుంటారు ; డబ్బులడిగితేమాత్రం ఇంట్లో పీనిగపోతుంది! ఎందులో వీళ్లు మా కంటే గొప్పాలంటా! ఆఁ, నోరుల్లో గొప్ప! మేం వీధుల్లో కేకలువేసుకు తిరగం — 'మేం గొప్పా, మేం గొప్పా' అని. నేను వూళ్ళో కాలెడితే చాలు వీళ్ళ కళ్లెర్రపడతాయి. ప్రతీ బొడుఖావూ! ఎగాదిగా చూసేవాడే! వీళ్ళకళ్ళల్లో జిడిపోస్తున్నా! గొప్పవాళ్ళమని ఇరగబడిపోతారు మళ్ళీ!"

నూతికి ఏవరో వచ్చిన చప్పుడైంది. గంగి గుండెలు దబ దబలాడాయి. కనపడిపోతే మరేమయినావుందా! ఒక్క తాపూ వూరికేపోదు.

తాడూ, కడవా పుచ్చుకుని వొంగి వొంగి వొక చెట్టు చాటుకి చీకట్లోకి వెళ్ళిపోయింది గంగి.

"ఎన్నడైనా, ఎవళ్ళమీదైనా దయఅన్నది వుంటుందా వీళ్ళకి! పాపం, అవాళ రాముణ్ని అలాకొట్టారు! నెల్లతరబడి రక్తం కక్కుకుంటూనే వున్నాడు వాడు. వెట్టిచాకిరీ చెయ్యలేదని వాడిమీద వీళ్ళ పెద్దరికం! వీళ్ళ పెద్దరికం మండిపోనూ!

ఇద్దరు స్త్రీలు నీళ్ళకోసమని నూతిపళ్లెంమీదికి వచ్చారు.

"మింగడానికి దయచేసి, తాజానీళ్ళు తెమ్మని హుకుం వేశారు! ముందే వుంచుకుంటేనేం! కడవలకోసం డబ్బుల్లేవు, పాపం!"

"మనం కొంచెంకూచుంటే చాలే, వీళ్ళకి మండుకొస్తుంది!"

"ఆఁ, తోడితే తెలుస్తుంది! ఓ, హుకుం వేస్తారు, తాజా నీళ్లు తెండని. మనం తొత్తులమైనట్టు!"

"తొత్తులం కాకపోతే మనమేమిటి? కూడూ, గుడ్డా పుచ్చుకోడం లేదూ!"

"మండించకు మరింత! రోజంతా పనిచేసి కాస్త విశ్రాంతి కోసం ప్రాణం కొట్టుకుపోతుంది. ఇంతిపని మరెక్కడన్నా చేస్తే ఎంతో పేరుబాటు దొరికేది. పైకిమాత్రం తీపిమాటలాడ తారు, పని చేసిచేసి చచ్చినా వీళ్ళ నోళ్ళు తిన్నగా తిరగవు."

ఇద్దరూ నీళ్ళు ముంచుకు వెళ్ళిపోయారు. గంగి చెట్టుచాటు నించి నూతిచీడిమీదికి వచ్చింది. పోకిరీమూక వెళ్ళిపోయారు. బుగత వీధి తలుపు వేసుకున్నాడు. పడుకోడానికి నాకిట్లోకి వెళ్ళాడతడు. గంగి తేలికగా నిట్టూర్చింది. ఎలాగయితేనేం తనకి అడ్డులేకుండాఅయింది.

అనగా అనగా ఒక రాజకుమారుడు అమృతం దొంగి లించడానికి వెళ్ళినప్పుడయినా ఇంత భద్రంగా అడుగులు వేసి వుండడు. నెమ్మదిగా బిగబట్టిన పాదాలు నూతిపళ్ళెంమీద వేసింది గంగి. ఇలాంటి విజయం తన జీవితంలో ఎన్నడూ తన అనుభవంలోకి రాలేదు. తాడు వురిపోసి కడవకి తగిలించింది. కుడిపక్కా, ఎడమపక్కా జాగ్రత్తగా పరికించింది. శత్రువుల దుర్గానికి సొరంగం త్రవ్వడానికి ప్రారంభించిన సిపాయిలా వుం దామె. పట్టుబడితే ప్రాణాలు దక్కవు. ఒళ్లు హూణామైపో

తుంది. ఎన్నో దేవతలికి మొక్కింది. ధైర్యం బిగబట్టింది. కడవ నూతిలో వేసింది గంగి.

మెల్లిగా, మరీమెల్లిగా నూతిలో మునకలు పెట్టిందికడవ చిటుక్కుమనికూడా చప్పుడవలేదు. రెండు మూడు బారలు తొందరగా లాగింది గంగి. నూతి చివరిదాకా వచ్చేసింది కడవ. మాంచి పహిల్వానూ అంతజోరుగా లాగలేడేమో!

కడవ అందుకోవడంకోసం నూతిమీద వొంగింది గంగి. ఇలా ఆమె వొంగిందో లేదో, దభీమని పడింది బుగతగారి తలుపు. పెద్దపులి నోరన్నా అంత భయంకరంగా వుండదు.

గంగి చేతిలోంచి తాడు జారిపోయింది. గుభీమని కడవ నూతిలో పడిపోయింది. ఎంతోసేపు నూతిలో కెరటాలచప్పుడు.

"ఎవరదీ? ఎవరదీ!"

కేకలువేస్తూ నూతిదగ్గిరికి వచ్చేస్తున్నాడు బుగత. నూతి పళ్ళెంమీంచి గెంతేసి పారిపోయింది గంగి.

ఇంటికి వచ్చి చూసేసరికి ముంత నోటికి తగిలించి ఆ కంపు నీళ్ళే తాగేస్తున్నాడు గురువులు.

---